# ఓన్లీవన్ కప్

లేక




గ్రంధకర్త:

నేలకంటి హనుమంతరావుగారు

P.V. Ramaiah

ప్రాప్తిస్థానము:

కర్రి అప్పారెడ్డి

వెల్లలమామిడాడ తూ॥ గో॥ జిల్లా.

**1946**

# గొల్లలమామిడాడ జీవదయామండలి.

**(స్థాపితము 15—3—1936)**

—♦ ఉద్దేశములు ♦—

ప్రాణిహింస మనుష్యులలో కఠినత్వము, క్రోధము మొదలగు దుర్గుణములను కలిగించి కష్టనష్టముల పాలుసేయుననియు, పాపహేతువనియు దెల్పి అట్టి ప్రాణిహింసలను మాన్పించి జీవుల ప్రాణరక్షణకై తోడ్పడుట.

—♦ దైవభక్తి ♦—

సత్ప్రవర్తన, దైవభక్తి కలిగియుండుటకై పరమార్థచింతన అభివృద్ధిచేయుట.

—♦ శాకాహారమును ప్రోత్సహించుట. ♦—

జంతుహింసలకును, క్రూరత్వమునకును మూలమగు మాంసాహారమును విసర్జించవలెననియు, శాంతిమార్గమునకును, నిష్కళంకమైన నీతివర్తనకును, ఆధ్యాత్మికాభివృద్ధికిని శాకాహారమే యోగ్యమైనదని ప్రచారముచేయుట.

—♦ మద్యపాననిషేధము. ♦—

సర్వవిధముల ప్రజలను పాడుచేయుట దేశ అనర్థకమునకును, గౌరవమర్యాదలకును ఆటంకము కలిగించు త్రాగుడు కూడదని ప్రబోధనచేయుట. భాషాభివృద్ధికై సద్గ్రంథముల పఠించుట.

ఇట్లు,

కర్రి అప్పారెడ్డి.

ఇతర వివరములకు:—జీవదయామండలి, గౌరవకార్యదర్శి,

గొల్లలమామిడాడ. తూ॥ గో॥ జిల్లా.

# ఓస్లీవన్ కప్

లేక

# సర్వనాశని

గ్రంథకర్త,

**నేలకంటి చినహనుమంతరావు.**



ప్రకటనకర్త.

**పి. వి. రామయ్య అండ్ సను రాజమండ్రి.**

స్టాకిస్టులు:

గొల్లలమామిడాడ జీవదయామండలి

**కర్రి అప్పారెడ్డి**

తూర్పుగోదావరి జిల్లా

**1946**

 [వెల **1-4-0**

# హెచ్చరిక

ఓస్లీవన్‌కప్ లేక సర్వనాశని అను నీ నాటకముయొక్క కాపీ రైటు మొదలగు సర్వహక్కులును గ్రంథకర్తగారి వలన నేను పొంది యున్నాను. కావున నాయొక్క వ్రాతమూలకమైన పర్మిషను లేనిదే, ఏసంఘమువారుగాని, ఏనాటకసమాజమువారుగాని, ఏపత్రికటనకర్తలు గాని, ఏవ్యక్తులుగాని ఏవిధమైన ప్రదర్శనాదికములును చేయరాదు. మరియు ఎవ్వరుగాని గ్రామఫోను రికార్డింగ్, టాకీస్క్రీనింగ్, భాషాంతరీకరణము వగైరాలు చేయరాదు. అట్లు వ్యతిరేకించి ప్రవర్తించిన వారు నాచే జరుపబడు సివిలు, క్రిమినలు చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలంగా తెలియజేయడమైనది.

ఇట్లు

కత్రి అప్పారెడ్డి.
జీవదయామండలి గౌరవ కార్యదర్శి.

గొల్లలమామిడాడ
తూ॥ గో॥ జిల్లా

## ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

1 గోవిందరాజు:—ఒక సంపన్నగృహస్థు.

2 రామారావు:—గోవిందరాజు కుమారుఁడు.

3 రాముం:—రామారావు కుమారుఁడు.

4 గౌరీశంకరం:—డాక్టరు.

5 అప్పారెడ్డి:—జీవదయాఖండలి గౌరవకార్యదర్శి మరియు జంతు బలి, మధ్యపాన నిషేధప్రచారకులు.

6 ఈశ్వరదత్తు:—జీవదయాసభాధ్యక్షుఁడు.

7 వీరయ్య:—ఒక రైతు.

8 సాహేబ్:—కటికవాఁడు.

9 కామేశ్వరరావు }
10 వెంకాజి } గోవిందరాజుగారి తాగుడు
11 రమణారావు } పార్టీలోనివారు
12 గోపాలం }

13 హరి }
14 వేణు } రామారావు స్నేహితులు.

15 పెంటయ్య:—చాకలి - కులపెద్ద.

16 ఆసాది:—అమ్మవారిని పూజించే అర్చకుఁడు.

17 ఇనస్పెక్టరు:—పోలీసు శాఖాధికారి.

ఇంకను చాకళ్ళు, పోలీసువారు, మొదలగుపాత్రలు సందర్భానుసారముగా వచ్చును.

### స్త్రీ పాత్రలు.

18 సుందరమ్మ:—గోవిందరాజుగారి భార్య.

19 శారద:—రామారావు భార్య

20 చిట్టితల్లి:—రామారావు కుమార్తె

21 రామాబాయి:—జగన్మోహినీ వేషముధరించిన వేశ్య.

22 సరసీరుహం:—రామారావు ఉంపుడుకత్తె, వేశ్య

23 ఎల్లి:—ఒక చాకలి స్త్రీ.

# ఓస్లీవన్ కప్

[ టీక ]

# సర్వనాశని

## సాంఘిక నాటకరాజము

---

### మొదటిరంగము.

(స్థలం గోవిందరాజుగారి గృహము) గోవిందరాజు సుమారు 50 యేండ్లవాడు. అనారోగ్యస్థితి. పడకకుర్చీలో కూర్చుండియుండును. వానిభార్య సుందరమ్మ. సుమారు 40 యేండ్ల వయస్సు. సన్నముగ పొడవుగ నుండును. భర్త కుర్చీసమీపమున చాపపై కూర్చుండియుండును. వారికుమారుడు రామారావు. అందమైనవాడు. సుమారు యిరువదివత్సరములవయస్సుండును. కొలదిదూరములో కుర్చీపై కూర్చుండి తనకుమారుని (సుమారు నాలుగేండ్లవానిని) ఆడించుచుండును. వాని పేరు రామం.

సుందరమ్మ—(కాఫీగ్లాసు అందిచ్చుచు) ఏమండీ! నేడు మీశరీరస్థితి యెట్లున్నది. రాత్రి బాగుగా నిద్ర పట్టినదా?

గోవిందరాజు—(అజీర్ణముచే తేన్పుచు) నాశరీరస్థితి యెట్లున్నదనియా యడుగుచుంటివి? రాత్రి బాగుగా నిద్రపట్టలేదు. అజీర్ణవ్యాధి నన్ను పట్టుకొని బాధించుచున్నది. రెండు మెతుకులు నోటవేసికొందునా అవి యఱుగక నా గొంతుకలో నున్నట్లుండును.

(పులితేనుపు రాగానే శిరము పట్టుకొని బాధ నటించుచు) అబ్బ! రాత్రి తిన్న తిండి యిప్పుడుకూడ పులితేన్పులు వచ్చుచున్నవి. ఈ తేన్పు వచ్చినప్పుడెల్ల వనవ్యాముగ నుండును.

సుందరమ్మ—ఎంతకాలము మీరీ అజీర్ణవ్యాధిచే బాధపడుదురు. ఏదేని మందు పుచ్చుకొనరాదా? కాఫీ చల్లారుచున్నది. పుచ్చుకొనుడు.

గోవిందరాజు—(అందుకొనకయే) ఏమికాఫీ త్రాగుట. దానినిగూడ త్రాగవలెనని లేదు. అదేమి ప్రారబ్ధమోగాని పూర్వులు గడించి యిచ్చిన పిత్రార్జితము బావతు భూములపై నుండి సంవత్సరమునకు వచ్చునాల్గు వేలాదాయముగాక నెలకు నూటయేబది రూపాయలు జీతము తెచ్చుచున్నను సర్వసంపదలు కలిగి యైశ్వర్యమనుభవించుచున్నను, పట్టెడన్నము నోటబెట్టుకొని తినునదృష్టము లేకపోయినది. అందుకే నన్న ద్వేషముగూడ పుట్టినది. (కొంచెము విచారముగా) చేసికొన్న పాపము ఫలించి షండైనప్పు డన్న ద్వేషముం గూడ పుట్టదా మరి (మధ్యమధ్యను తేన్పుచు)

తే. గీ. సర్వసంపదలును గల్గి శాంతిపడక
నింక నెక్కువ గడియింప శంకదక్కి
లంచములమూలమున డబ్బు లాగియుంటి.
నున్నతోద్యోగ మనుబల మున్న దనుచు.

తే. గీ. బీదలగువారి యుసురుకల పిండికట్టి
ధనము తినబోవ నరుగునే? ధరణియం ద
దియు నజీర్ణరోగమగుచు దినదినంబు
ప్రాణసంకటమగురీతి బాధపెట్టు.

సుందరమ్మ—ప్రాణేశ్వరా! ఆ పేటిమాట.

తే. గీ. లంచముల బుచ్చుకొనుటన్న లాఘవంబె
పూర్వకాలమునుండియు బుధవరేణ్యు
లెల్ల నాచరించుచునున్న దిదియ కావ
నింద లొగరింప నేలనో నిఖిలప్రభల.

చూచితిరా సుబ్బారావుగారు. కలెక్టరుఆఫీసులో హెడ్‌గుమాస్తాగా పనిచేయుచు పెద్దవీధిని మేడ కట్టించి కుమార్తెకు వెయ్యి రూపాయలు కట్నమిచ్చి కొంత పెద్దసంబంధము చేసినాడో. ఆ పెళ్ళికొడుకిప్పుడు ఎం. ఏ. ప్యాసయి పట్టణములో 'లా' చదువుచున్నాడట. మొదటిలో సుబ్బారావుగారు తినడానికయినా తిండి లేక యుండేవాడు. ఏలాగోలాగ ఉద్యోగము సంపాదించి ఉద్యోగము చేస్తూ ఉంటే నెలకు వచ్చేజీతము తిండికే సరిపోక ఎంత బాధపడేవాడో ఎరుగుదురా? అధికారిప్రవేశము సంపాదించి హెడ్‌గుమాస్తాఅయి లంచాలుక్రింద వందలు, వేలు గుంజుకోవడం ప్రారంభించాకే కదూ, యీమేడలు, మిద్దెలు, భూములు, సంపాదించడం, కూతుళ్ళకు పెళ్ళిళ్ళుచేయడం, భార్యకు నగలు చేయించడం, పిల్లలకు చదువులు చెప్పించడం, ప్రారంభించాడు. మొదట్లో యింటిలో బియ్యము లేక పోయినప్పుడల్లా సుబ్బారావుగారిభార్య రాజేశ్వరి మనయింటికి వచ్చి సుందరమ్మవదినా! మీయన్నయ్యకు బజారునకు వెళ్ళడానికి తీరుబడి లేదట ఇంట్లో బియ్యం లేవు. రేపు మళ్ళీ మీవాకే తీర్చివేస్తాను, ఒకకుంచెడు బియ్యం బదులిమ్మని అడిగి పట్టుకువెళ్ళేది. ఏదైనా పేరంటానికి వెళ్ళేటప్పుడు నానగలు తొడుక్కుని వెళ్ళేది. అల్లాంటిది చూచారా? ఎల్లాంటినగలు పెట్టుకొంటూందో. దీనికంతకీ కారణం లంచాలేగదూ.

తే. గీ. లంచములఁ గొనుచుండు టా లాంఛనముగ
కార్యమేదైన చేయగా గడగునపుడు
కొంచెమగువారియొద్దను కోర్కెలూర
పెద్దయుద్యోగి నేర్పుగా పిండుచుండు.

మరియొక సంగతి విన్నారా? రమణారావుగారు జిల్లాబోర్డులో గుమాస్తాయుద్యోగమే కదండి చేస్తుంట. అయితేయేం ప్రెసిడెంటుని వలలో వేసికొని ఎలిమెంటరీబడిపంతుళ్ళను, బదలాయింపుచేయిస్తానని చెప్పి వాళ్ళదగ్గఱ పదులు యిర్వైలు లంచాలు పుచ్చుకొని కొందరిని బదలాయింపులు చేయించి కొందరిని చేయించక ప్రెసిడెంటుగారు మీ కాగితము యింకాచూడలేదు. చేయిస్తానని మళ్ళీ చేయిచాపి పుచ్చుకొన్న వారిదగ్గఱే మళ్ళీపుచ్చుకొని యెంతడబ్బు సంపాదించాడో గ్రహించారా? కాంగ్రెసునాయకుల మని, యందఱ ఉపకారము చేస్తామని ప్రబోధముచేసి మంత్రులయి లంచాలు పుచ్చుకొని పట్టణములలో మేడలు కట్టినవారిని మీ రెఱుగరా? ఏయుద్యోగస్థుడు లంచాలు పుచ్చుకోవడం మాని మడిగట్టుకొని కూర్చున్నాడో చూపించండి.

గోవిందరాజు—సుందరమ్మ వైనఁదుకు నీపలుకులుకూడ సుందరంగానే యున్నాయి. నీవు చెప్పిన సంగతులన్నీ యథార్థమే. కాని యట్టివారికికూడ నావలె యజీర్ణరోగము కలిగి యున్న ద్వేషము పుట్టునమాట యథార్థము. (అని తేన్చును)

సుందరమ్మ—(చిరునవ్వుతో) అది మీపిచ్చినమ్మకము. ఇదిగో! కాఫీ చల్లారిపోవుచున్నది. పుచ్చుకొనరేమి?

గోవిందరాజు—ఈపూట కాఫీకూడ పుచ్చుకొనవలెనని లేదు. నీవు పుచ్చుకొనుము.

సుందరమ్మ—కాఫీ పుచ్చుకొనకున్న శిరసము చేసి నరములు లాగును.
పుచ్చుకొనడు.

గోవిందరాజు—(కాఫీగ్లాసు అందుకొని నగము త్రాగి, తేన్చుచు చిరునగవుతో భార్యను చూచి)

తే. గీ. సేవించిన కాఫీకి శాకసేరు
కాళ్ళు లాగును నడువగా వ్రేళ్ళు పట్టు
దస్త్రం వ్రాయుచుండ దలయు నొప్పి వచ్చు
కాఫీమహిమంబు వర్ణింప గలడె కవియు.

అని కాఫీగ్లాసును భార్య కందించును

(వంటయింటినుండి శారద ప్రవేశము)

శారద—(అత్తమామలవైపు చూచి) వంటయైనది. మడికట్టుకొని భోజనమునకు రండు. (ప్రక్కనే కూర్చునియున్న భర్త రామారావును గాంచి మీరు కూడ భోజనమునకు లెండు. (చిఱునగవుతో) అబ్బాయి రామంకూడ మీతో తినునేమో తీసికొనిరండు.

గోవిందరాజు—అమ్మా! అప్పుడే వంటయైనదా? (తేన్చుచు) చిట్టితల్లి యేమిచేయుచున్న దమ్మా.

శారద—ఇప్పుడే పాలిచ్చి యుయ్యాలలో పరుండబెట్టి నిద్రబుచ్చితిని. నిద్రించుచున్నది. సుశీల లేచునప్పటికి భోజనములైనచో బాగుండును.

సుందరమ్మ—అవును. నీవేగి వడ్డనప్రయత్నము చేయుచుండుము. మేము వచ్చెదము. (శారద నిష్క్రమించును)

నాథా! భోజనమునకు లెండు (కుమారుని వైపునకు తిరిగి) అబ్బాయి! రామారావు! నీవుకూడ లేచి మడి కట్టుకొమ్ము.

గోవిందరాజు—(లేవ్వుచు) ఏమిభోజనము. తిందమన్న నహించుట లేదుగదా. నా మాటకేమి మీరేగి భోజనము చేసి రండు.

సుందరమ్మ—అయ్యో! అట్లనెదరేమి యీపూట భోజనమే చేయరా? ఏదైన మందుతీసికొనరాదా? ఉపేక్షించిన రోగము ముదురదా?

గోవిందరాజు—అదియే నేను ఆలోచించుచున్నాను.

సుందరమ్మ—డాక్టరు గౌరీశంకరమునకు కబురువంపుము. అతఁ డేదైన నలహానైన నిచ్చును. లేదా మందైన నిచ్చును. కుమారునివైపు తిరిగి) అబ్బాయి! రామారావూ! రామాన్ని నాకిచ్చి నీవేగి డాక్టరు గౌరీశంకరముగారిని పిలుచుకొనిరా!

రామారావు—(రామమును తల్లి కిచ్చి) ఇప్పుడే తీసికొని వచ్చెదను. అని నిష్క్రమించి వెటనే డాక్టరు గౌరీశంకరమును తీసికొనివచ్చును.

గోవిందరాజు—డాక్టరుగారూ! దయచేయుడు! యీకుర్చీపై కూర్చుండుడు.

గౌరీశంకరం—(కుర్చీలో కూర్చుండి) గోవిందరాజుగారూ! న న్నేల పిలిపించిరి. మీ శరీరములో నేదైన రుగ్మత కలిగినదా?

గోవిందరాజు—అవునండి. తిన్నతిం డఱుగక, పులితేన్పులు వచ్చి బాధపడుచున్నాను. దానికితోడు నరములు బలహీనత కలిగి నడచుటకైన శక్తి గనిపించుటలేదు. ఎంత యదృష్టమున్ననేమి యన్న ద్వేషము పుట్టినతరువాత.

సుందరమ్మ—డాక్టరుగారూ! దీని కేదైన తగినమందు దిప్పించుడు.

గౌరీశంకరం—(గోవిందరాజును పరీక్షించి) యీరోగము త్వరలో కుదురవలెనంటే డైలీ ఓన్లీ వన్ కప్ బ్రాంది పుచ్చు కొనుచుండిన తగ్గును.

గోవిందరాజు—డాక్టరుగారూ! ఇదేమి మందు?

సుందరమ్మ—డాక్టరుగారూ! మీరుచెప్పిన మం దేమిటో నాకు బోధపడ లేదండి.

గౌరీశంకరం—అనగా ప్రతిదినము ఒకటీగ్లాసు బ్రాంది పుచ్చుకొను చుండిన జరముల నిస్సత్తువను తగ్గించి అజీర్ణవ్యాధిని తగ్గించును.

సుందరమ్మ—బ్రాంది పుచ్చుకొనుచుండిన నది త్రాగుడు కాదండి? త్రాగుచుండిన లోకులు నిందింపరండి! ఇట్లాంటిమందు చెప్పేరేమిటి?

గౌరీశంకరం—ఔషధప్రాయంగా పుచ్చుకొనుచుండిన నది నిందా పాత్రమెట్లగును? కొన్నికొన్ని మందులలో మేము బ్రాంది కలిపి యిస్తూనే యుంటాము. ఆసంగతి రోగులకు తెలుస్తుం దా? మందని వారు పుచ్చుకొనుట లేదా? కొన్ని జంతువుల చమురు మందుల కుపయోగపడుచున్నది. రోగనిర్మూలనముకొఱకు కట్టివి వాడ కున్న యెట్లు సరిపడును? రోగులకు బలము కలుగజేయుటకు కోడి గ్రుడ్లలోనిసొన త్రాగుమని సలహా నిచ్చుచుందుము. రోగులు మా సలహాప్రకారము కోడిగ్రుడ్ల నుపయోగించుచున్నారు. అది మాంసా హార మగునా? బాలింతరాండ్రకు బ్రాంది నిచ్చుట లేదా? అంతమా త్రమున నది త్రాగు డగునా? జరముల నిస్సత్తువను తగ్గించి బలము

కలుగజేసి, యజీర్ణవ్యాధిని పోగొట్టి జఠరాగ్నిని వృద్ధిజేయుటకు బ్రాందికన్న మంచిమందు లేదు.

సుందరమ్మ—మీమాటలు యథార్థమే యగుగాక.

ఉ. ఔషధసేవగా మొదట నంటినవారలె తప్పత్రాగుచున్
శమజమెల్లవీడి నడి పీనుగువోలెను వీధులందునన్
దూషితవాక్యజాలములతో నడయాడుచునుంట జూచుచున్
దోషములేదు బ్రాందికన తోచెను మీకును నేమిచెప్పుదున్.

గౌరీశంకరుడు—సుందరమ్మగారూ! తప్పత్రాగి తూలుచు వీధులందు బడి దొర్లిన నది తప్పే యగును. కాని ఔషధసేవ కొఱకు పుచ్చుకొన్న నది తప్పనరాదు. గోవిందరాజుగారూ, రామారావును బజారునకు పంపి ఒక బ్రాందిసీసాను తెప్పింపుడు.

గోవిందరాజు—(కుమారునిచూచి) నాయనా! నీ విపుడే బజారునకేగి యొకబ్రాందిసీసాను తీసికొనిరమ్మా. ఇవిగో రూపాయలు (అని యిచ్చును. రామారావు బజారునకేగి ఒక బ్రాందిసీసాతో తిరిగి వచ్చును)

రామారావు—నాయనగారూ! ఇదిగో! బ్రాందిసీసా. (అని యిచ్చును)
ఆ సీసాను గౌరీశంకర మందుకొని కార్కుతీసి ఒక గ్లాసులో కొంచెము పోసి)

గౌరీశంకరం—గోవిందరాజుగారూ! ఇదిగో ఓస్లీవన్ కప్ బ్రాంది స్వీకరింపుడు. దీనివలన మీకు పూర్ణారోగ్యము కలుగును. (అని అందించును)

గోవిందరాజు——(అందుకొని) ఓస్లీవర్కప్. ఒకటేగ్లాసు. దీనిని త్రాగినగాని గుణము తెలియదు. (అని గొంతుకలో పోసికొని దానిమంటకాగలేక) ఓక్ ఓక్ (అని క్రక్కు వేయుచు తల రెంబుచేతులతోను పట్టుకొని) అబ్బా! దేవుడా! ఎంతశ్రమ కలిగించావురా! (అని గ్లాసు పారవేయును) డాక్టరుగారూ! మహామంచిమందిచ్చారండి.

గౌరీశంకరం——ఏ మట్లు క్రక్కు వేసితిరి?

గోవిందరాజు——ఏమని చెప్పుమందురు?

తే. గీ. బ్రాంది, నోటను బెట్టినన్ భగ్గు మనుచు
నోరు గొంతుకయును మండె దారుణముగ
నగ్నిహోత్రము నోటితో నమలినట్లు
నెట్లు త్రాగుదురో దీని నెఱుగ నకట!

గౌరీశంకరం——అట్లని గ్రక్కువేతురా? మందు చేదుగా నుండక తియ్యగా నుండునా? యీమారు వేగముగ మ్రింగి వేయుడు. మ్రింగినపిమ్మటగాని రోగము శాంతించదు. (అని మరల గ్లాసులో పోసి యందించును.)

గోవిందరాజు——(అందుకొని వేగముగ మ్రింగి తల బాదుకొనుచు) అమ్మబాబో! కడుపులో మండుచున్నది.

గౌరీశంకరం——మరేమియు భయము లేదు. కొంతసేపటి కామంటలు తగ్గును. శయనింపుడు. ఇక నాకు శల విప్పించుడు పోయి వచ్చెదను.

గోవిందరాజు——మంచిది పోయిరండు.

(గౌరీశంకరం నిష్క్రమించును)

సుందరమ్మ——నాథా! యిపు డెట్లున్నది?

గోవిందరాజు—కడుపులో మండుచున్నది. తల గిర్రున తిరిగిపోవు చున్నది. నీ వెచ్చట నున్నావో నాకు కనిపించుట లేదు. శరీరము చెమటలు గ్రమ్ముచున్నవి.

సుందరమ్మ—అట్లయిన కొంచెముసేపు నిద్రింపుడు. మీ కాశ్రమ తగ్గును.

గోవిందరాజు—నేను శయనించెదను. కాని మీరు భోజనము చేయ నేగుడు. చాలసేపైనది. వంటైె శారద మీకొఱకు కనిపెట్టుకొని యుండును.

(సుందరమ్మ, రామారావు నేగుదురు)

తెరవ్రాలును.

## రెండవ రంగము

(గోవిందరాజుగారి గృహమున గోవిందరాజు కుడిచేతిలో కప్‌ను నెడమచేత బ్రాందిసీసా పట్టుకొని, కొంచెముబ్రాందిని గ్లాసులో పోసి)

గోవిందరాజు—ఓన్లీ వన్ కప్. ఒకటే పాత్ర. బ్రాందిని సేవించుట మంచిదని డాక్టరు గారీశంకరం సలహా యిచ్చాడు. (అని త్రాగి) ఆహా! ఏమి మజాగా ఉంది? యీ బ్రాంది. దీనిని సేవిం చడం ప్రారంభించాక, అజీర్ణవ్యాధి, నరముల బలహీనత తగ్గి చాల

సౌఖ్యముగా యుంది. కాని, దీనిని సేవించినకొలది యింకా పుచ్చు కోవాలనే బుద్ధి పుడుతూంది. మొదటలో దీనిని త్రాగడానికి ఎంతో కష్టముగా యుండేది. ఇప్పుడో అతిసునాయాసంగా ఉంది. దీనికి కారణం యేమిటంటే "అభ్యాసం కూసువిద్య" అన్నారు పెద్దలు. (మరల గ్లాసులో బ్రాందిని పోసి) "పీత్వా పీత్వా గుణం పీత్వా" అన్నసామెత యుండనే యుంది. "త్రాగగా త్రాగగా" గాని గుణము తెలియదు. (అని మరల త్రాగి) ఇప్పటికి కొంచెము గుణము కనిపి స్తుం దనుకొంటాను. (కొంచెము తూలుతూ) దీనిలో యింత మంచి గుణముంది కనుకనే పాశ్చాత్యులు దీనిని తయారుచేసి హిందూ దేశానికి దిగుమతి చేయుచున్నారు. దీనియద్భుతశక్తి తెలియని గుణ హీనులు నిందిస్తూ ఉంటారు. (మరల గ్లాసులో బ్రాందిని పోసి త్రాగి) తూలుతూ మాటలు తొట్రుపడుతూ పూర్వం రాక్షసగురు వైన శుక్రాచార్యుడు త్రాగడం తప్పని శాశించాడట. వానిశాసనం అమలులో పెట్టేవా డెవడోకాని, (మరల త్రాగి) వెనుకటి కెవడో త్రాగడానికి చేతిలో డబ్బులేని యొకత్రాగుమోతు సప్తసముద్రాలు సారాయికావాలని ప్రార్థించాడట. పాపం వాడు డబ్బులేక యెంత యిబ్బందిపడ్డాడో కనుక అల్లాంటివాళ్ళకి నాలాంటి సంపన్నగృహస్థు యేంచేయాలంటే వేసవికాలములో పాంథులకోసం మంచినీళ్ళ చలి వేంద్రములు పెట్టించినట్టు, వూరూరా ఒక్కొక్కసారా చలివేంద్రి గాని, కల్లు చలివేంద్రగాని పెట్టించాలి. అల్లాంటిపనికి నేనే ముందంజ వేస్తా. లేకపోతే బీదవాళ్ళు యెల్లా బ్రతుకుతారు. అల్లాగ చేసి నట్ట యితే దేశంలో ఆర్థికదుస్థితికొంతతగ్గి, బీదవాళ్ళు పెళ్ళాన్ని, పిల్లల్ని పోషించుకోవడానికి వీలు కలుగుతుంది. [మరలత్రాగి] మొన్నటిరోజున సుబ్బారావుగారుస్నేహితులందరిని నాహ్వానించి, బ్రాందీపార్టీ చేశాడు. అల్లాగే నేను ఫ్రండ్సునందఱ బిలుపించి డ్రింకుపార్టీ చేయాలి. అల్లా

చేసేటప్పుడు బ్రాందీపాత్రలను పురుషులందించక స్త్రీలే అందిస్తూ ఉంటే త్రాగేవాళ్ల ప్రాణానికి యెంతహాయిగా ఉంటుంది. నేను పార్టీ చేయించేటప్పుడు వేశ్యలను రప్పించి, యీపని వాళ్ళచే చేయిస్తా. అప్పుడు చాల అందంగా ఉంటుంది. పూర్వము జగన్మోహిని యమృతపాత్ర చేత్తో పుచ్చుకొని వడ్డిస్తూ ఉంటే, త్రాగేవాళ్ళు యెంతో యానందించారని భాగవతం చాటుతుంది. (తూలుతూ, మాట తడబడుతూ యీక్రిందిపద్యమును చదువును.)

తే. గీ. త్రాగవలెనన్న బ్రాందియే త్రాగవలయు
కడుపు నిండుగ మనుజుడు పుడమియందు
దూరదేశమునుండియు దుమికి దుమికి
సంద్రమును దాటి వచ్చె నీ బ్రాందిబుడ్డి.

("ఆ" అని రాగాలాపన చేయుచు పడిపోవును)

తెరవ్రాలును.

## మూ డ వ ర ం గ ము

(కులపెద్దయైన చాకలి పెంటయ్య యింటియొద్ద. పెంటయ్య వెండిమురుగులు, వెండిచిప్పల మొలత్రాడు, మళ్ళగట్టిన పంచె, చింపిరి రాగివెంట్రుకలతల, కోరమీసాలు, మొల్లటి జీరగల కన్నులతో నుండును. చాకలి ఎల్లి వానికి కొంచెముదూరములో నిలుచుండి ప్రతి మాటకూ జవాబు చెపుతున్నట్టుగా ఉంటుంది.)

ఎల్లి—పెంటయ్యమామయ్యా! నానేరము కాదు యీపాలి అల్లాంటి తప్పుచేత్తే పీకతీయించి కోటగుమ్మానికి కట్టించు.

పెంటయ్య—ఎల్లీ! ఎందుకే యీబతిమాల్లాలు. ఆయాల సెప్పలే దంటే చేసుకొన్న మొగుణ్ణి వదిలేసి పరాయోడి తోటి తిరగడం తప్పని.ఆయాల నామాటింటే నీ కిన్ని తిప్ప లెందు కొత్తాయి.

ఎల్లి—బుద్ధి గడ్డితిని కళ్ళు నెత్తికొచ్చి అల్లా చేసేను. ఈపాలి నీ మాటినకపోతే నమలి గడ్డెట్టు మామయ్యా!

పెంటయ్య—(కోపముతో) నీలాంటోళ్ళకు నమలి గడ్డెట్టేమాత్రం యేంటి. కళ్ళు మూసుకొని రమ్మాన్నావోళ్ళకూడా లేచిపోయే ముండలికి నిచ్చేపంలాంటి మొగుణ్ణి వదిలేసి కొంగట్టుకు లాగాడని పేమపుట్టి పెద్దకాపుకు పోయావుకదూ! ఆడు ని న్నుద్దరిత్తా డనుకొన్నావా? సంసారికొంపలు, సన్నాసికొంపలు చేసేదాకా అడవి దున్నలాగ కూడా వెంబడించి తిరిగి, తిరిగి సంసారములోంచి, యివ తలకి లాగి, ఆళ్ళవళ్ళుకొవ్వుతీరాక నీ వక్కర లేదు పొమ్మంటారు. అల్లాంటి ఉచ్చునాకుడుగి త్తల్ని చూచి పళ్ళిగిలించిన ఆడదా న్ననాలి కాని, ఆళ్ళ కేం పోతుంది.

ఎల్లి—ఆమాత్రము తెలిసుంటే యీనేరం మెందుకు చేత్తాను మామయ్యా!

పెంటయ్య—మొగుడెల్లాంటోడైనా ఆడిపాదాలు కొలిచి, పూజిం చాలికాని పరాయోడితో పోయిందాన్ని అమ్మో బలే తేమాత్రం పాపం పోతుందంటే. కట్టానికి, సుఖానికి, చూచే వోడు మొగుడు. అందుకనే మొగుడో, మొద్దులో అన్నా రుగ్గానుల్లు. అల్లాంటప్పుడు మొగుడికి కట్టంవత్తె ఆడది చూడొద్దు. అరుంధతమ్మ

గారు, చంద్రిమతమ్మగారు, సావిత్రమ్మగారు, సీతమ్మగారు ఎన్నెన్ని కట్టాలుపాలయ్యారు. ఆళ్ళు నీలాగే మొగుణ్ణొదిలేసి లేచిపోయినారా? ఆమాత్రం ఆలోచించుకోవద్దు. అంకుమొగుడు అందలాల్లోనుంచి ఊరేగించాడా? చేసుకొన్న మొగుడు - ఊరేగించకపోయాడా? ఈడే మెట్టాడే, ఆడూ అదే పెడత. అక్కడైనా తినేదన్నమే. ఇక్కడైనా తినేదన్నమే. అక్కడేమైన బంగారముగాని తిన్నావా? యీ మాత్రం దాని కాణ్ని చూచుకొని పొంగిపోయేదానివి. గ్గాపకం లేదు.

ఎల్లి—గ్గాపకం లేకేమి మామయ్యా! ఆచచ్చినా డేదో నెత్తిమీద రాయడతాడనుకొన్నా. తీరా తీసికెళ్ళి గంగలో దించేశాడు. 'ఉభయుబ్బట్టుత్వం ఉప్పర సన్నాసం' అయింది.

పెంటయ్య—గంగలో దింపేశాడూ! మాబాగా దింపేశాడు. గంగలో దింపేత్తే అందులో పడి సావక మళ్ళీ ఎల్లాగొచ్చావు?

ఎల్లి—గంగలో దిగేసరికి చలేసి భయంపుట్టి బ్రితికొచ్చాను మామయ్యా!

పెంటయ్య—తెల్లవారకుండానే గంగలో దిగి త్తానం చేయు బామ్మలకి, మొల్లోతునీళ్లో దిగి బట్టలుగుంజే చాకలోళ్ల కి చలిభయం యేమిటి? యీసాలి జుట్టుకు రాయికట్టుకొని దిగు! యేం భయ ముండదు.

ఎల్లి—ఈమద్దెని నీట్లో దిగిబట్టలుగుంజడం లేదుగదూ! మామయ్యా నీట్లోకి దిగేసరికి, పాణం అంటే భయంపుట్టి, చావలేక, పెంటయ్యమామయ్య కాళ్ళు పట్టుకుంటే కాపరం చుట్టవుతుంది గద్దాయని వచ్చాను. మామయ్యా! నీ కాళ్ళు పట్టుకుంటాను నా

కాపరం చుట్టిచెయ్యి. ఇక జాగ్రత్తగా మసలుకొంటాను. బుద్దొచ్చింది. (అని కాళ్ళు పట్టుకొని ఏడ్చును.)

పెంటయ్య—(జాలికలిగి) లేపిల్లాలే! నాకాళ్ళట్టుకుంటా వెందుకు నీ మొగుడికాళ్ళట్టుకో. ఆడికి దయవత్తే యేలుకుంటాడు.

ఎల్లి—(ఏడుస్తూ) మామయ్యా! నీవు చెప్పినట్టే కాళ్ళు పట్టుకొన్నా. కాళ్ళట్టుకుంటే "ఇదివరకు పనికిరాని మొగుణ్ని యియ్యాల పనికొత్తానా" అని తన్ని యీడ్చేశాడు. బతిమాలుకొన్నా, ఎన్నియిదాల బతిమాలుకొన్నా నామాట యినిపించుకోలేదు. నీవు కులపెద్దవుగందా! నీవు చెపితే యింటాడు. నన్ను రచ్చించు.

పెంటయ్య—నీమొగుడున్నాడే ఆడువట్టిచండచాచన ముండాకొడుకు. ఒకడు చెపితే యినేరకం కాదు. మరిచెప్పి చూస్తాను. కాని యినక పోతే నేనుమాత్రం యేం చెయ్యను.

ఎల్లి—నీవల్లా అంటే నాబతుకెల్లాగ. ఎల్లాగో నచ్చచెప్పు మామయ్యా!

పెంటయ్య—అన్నియిదాలా చూత్తాను కాని ఆడు "ఊఁ" అంటే నిన్ను కులంలో కలుపుకోవడానికి, కులంవాళ్లని అందరిని పిలిపించి, కల్లు నీళ్లోయించాలి. అందుకు రెండువందలౌతాయి. అయ్యిమాత్రం జాగ్రత్తచేసి ఉంచు.

ఎల్లి—మామయ్యా! నాకాడ రెండువంద లెల్లా వచ్చాయి.

పెంటయ్య—అల్లా అంటే మాత్రం కుదురదు. ఎల్లాగోలాగ సూడాలి.

ఎల్లి—నన్ను గంగలో దిగమ్మంటే దిగుతానుగాని నా కెల్లా వత్తాయి మామయ్యా! (ఏడ్చుచు)

పెంటయ్య—ఎల్లాగొత్తాయో? నీఅంకు మొగుడుదగ్గర కెళ్ళి ఆడికాళ్ళు పట్టుకొని పడ్చి, నీకాపరం చెడగొట్టినందుకు, రెండు వందలియ్యమని యడుగు. లేకపోతే బతికున్నన్నాళ్ళు పోచించమను. తెలిసిందా. కాపరం చెడగొట్టినందుక్కు రెండువందలు యియ్యలేడా? పో! పో! రెండువందలు పట్టుకురా? తరవాత చెపతాను. తెలిసిందా?

ఎల్లి—సరేమామయ్యా! ఆరికాడికెళ్ళి అడిగి తెత్తాను.

పెంటయ్య—ఎల్లి తే రెండువందలూను. అయ్యి తెచ్చి నా చేతిలో పొయ్యి. ఈలోపున నీమొగుడితో చెప్పి ఎల్లాగో లాగ వప్పింతాను.

ఎల్లి—అల్లాగే మామయ్యా! నాకాపరం చుట్టిచెయ్యడం నీచేతులో ఉంది.

పెంటయ్య—రెండువందలు తెత్తే కాపరం సుట్టిచెయ్యడాని కష్టాంతరం ఉండదు. బీదోళ్ల కాపరాలు చెడగొట్టి యిడదీసిన తొందవలకి యిలాగ జురుమానాలు యేత్తేనేగాని బుద్ధి రాదు. ఇల్లాగ ఒకళ్ళయిద్దరికి జరిగితే తక్కినోళ్ళకి భయం ఉంటది. కులతప్పులని నిలబెట్టి ఆళ్ల దగ్గఱ లాగడానికి ఒకమార్గము. ఇది ఆళ్ళకి జురుమానం అవుతుంది. ఎల్లీ యిక నీవెళ్ళు.

ఎల్లి—మామయ్యా! ఎల్లొత్తా.

పెంటయ్య—మంచిది పిల్లా.

(ఎల్లి నిష్క్రమించును)

తెరవ్రాలును.

# వాల్గవరంగము.

(రామారావు యొంటరిగా గదియందుండఁగా తెర లేచును.)

రామారావు—నేడేమోగాని నీరసముగా యున్నది. బుద్ధి వికసించుట లేదు. ఏపనిచేయుదమన్నను తోఁచుటలేదు. ఈబుద్ధి మాంద్యమునకును, నీరసమునకు కారణ మేమై యుండును. (ఆలోచించి) ఏకారణమును కనిపించుటలేదు. మానాయనగారు సేవించు బ్రాందిని కొంచము పుచ్చుకొనిన, నీరసము తగ్గునేమో! బ్రాందిసీసా యలమారులో నున్నదిగదా? రవంత త్రాగి చూచెద. (అని యల మరకడ కేగి, దానిని తెరచి బ్రాందిసీసా పైకి తీసి చేతితో పట్టు కొనగా శరీరము కంపించును) ఏమిచెప్పుమా, యీబ్రాందిసీసాను తాకినంతనే నాశరీరము కంపించుచున్నది? నాగుండెలు దడదడ కొట్టు కొనుచున్నవి. నామన స్సేదో యుద్బోధ చేయుచున్నట్లున్నది. "సుకుమార కోమల కరపద్మమున యశుచిబ్రాందిసీసా నంటకుము. అంటినచో మలినాంగుడ వయ్యెదవు. ఒక్కమారు బ్రాందిసీసా నంటి నచో నది నీచేతి నంటుకొనిపోయి యిక విడువదు. దానితో నీ వధః పాతాళమున బడుదువు. సుధామయమగు నీకీర్తిచంద్రికలు మాసి నల్లనగును, నీతెలివియు బుద్ధియును నశించును. సౌభాగ్యసంపన్న మగు నీయానందమయకుటుంబము సౌభాగ్యహీన మగును. విడు వుము. త్వరలో నద్దానిని నీచేతినుండి విడిచివేయుము. విడువవేని యది నాశనమునకు హేతు వగును. జాగ్రత్త" అని నామనస్సు ప్రబోధించు చున్నది. ఛీ! ఛీ! యీపాడుపానీయమును ముట్టరాదు. (అని బల్ల

మీాద పెట్టును) బ్రాంది, కల్లు, సారాయి, యిస్కీ, బీరు మొదలగు మత్తువస్తువులను త్రాగుటవలన—

ఉ. పేరు నశించు కీర్తి చెడు పిన్నలు పెద్దలు త్రాగుమోతు వీ
డారయయంచు నవ్వెదురు హాస మొనర్చుచు బంధువర్గముల్
చేరగ నీరు భార్యయును చింతిలు పుత్త్రిలు తల్లిదండ్రులున్
మేరయులేని దుఃఖమును మ్రింగుచు నాశన మౌదు రక్కటా.

అట్టియెడ నీ బ్రాందితాగ్రు నుద్యమమునుండి విరమించెదగాక! (అని యొకకుర్చీలో కూర్చుండి కొంతసేపైనతరువాత తిరిగి నీరసము నటించి) ఇదంతయు వెఱ్ఱి. నీరసము తగ్గుటకు కొంచెము త్రాగినంత మాత్రమున నష్టమేమి? దీనికి కీర్తిపోయి యపకీర్తి వచ్చుటకు కారణ మేమి? పిన్న పెద్ద లేల నవ్వెదురు. భార్యాపుత్త్రిలు, తలిదండ్రిలు దుఃఖించవలసినంత యగత్య మేమున్నది? ఒకమారు త్రాగినంత మాత్రమున నష్ట మేమున్నది. ప్రతిదినము తప్పత్రాగి వడలు తెలి యక తూలుచు రోడ్డపై దొర్లినకదా యపకీర్తి? నిత్యము దీనిని నేను సేవింతునా? అవసరమువెంబడి త్రాగు టుచితమని యెవ్వరనరు. అని కుర్చీనుండి లేచి బల్లదగ్గఱ కేగి సీసాలోని బ్రాందిని గ్లాసులో పోసి త్రాగుచుండగా శారద వచ్చును. భార్యను గాంచి రామారావు నిర్ఘాంతపడి గ్లాసును బల్లమీాద పెట్టును.

శారద—(ప్రవేశించి కంగారు) అయ్యో! అయ్యో! ఏమిచేయు చున్నారు. బ్రాందిని త్రాగుచున్నారా?

మ. తగునే మీాకిటు బ్రాంది త్రాగుట మహాత్మా! సర్వము న్నాశనం
బగు నిద్దాని నపేక్షతో పెదవికిన్ యంటించినన్ కీర్తి వ
మ్మగు నమ్మందగు నాదుమాట లకటా! మర్యాద పోగొట్టునీ
జగదోపద్రవకారి ముట్టదగునే చర్చింపు డీ మీాయదిన్.

సర్వనాశనకారిణ్యైన బ్రాంది త్రాగుటవలన ముప్పురాదా? ఏల త్రాగితిరి?

రామారావు—ప్రియసీ! నేను బ్రాందిని త్రాగితి ననుకొంటివా?

శారద—త్రాగితిరి. నేను వచ్చునప్పటి కాబ్రాందిగ్లాసు మీపెదవుల నంటియే యున్నది. నాకనులతో నేను చూచితిని.

రామారావు—(తనలో) నేను త్రాగుచున్న దీమె చూచియే యున్నది. అయినను లేదని బుగమొత్తెదను (పైకి) నీకనులు భ్రమ జెందియున్నవేమో? నేనాసీసాను ముట్టనైనను లేదు.

శారద—మీ రాబ్రాందిసీసానైనను ముట్టలేదా?

తే. గీ. తప్పు పనిచేసి లేదన దబ్బ రగును
గాక, నమ్ముదునే మాట, కనులు మూసి
పిల్లి పాలుత్రాగుచు సంతసిల్లి నట్లు
చెప్పుచున్నారు నాతోడ సిగ్గు విడచి.

అటులైన మీనాయనగారు సేవించు బ్రాందిసీసా నలమారు లోనిది. మేజాబల్లపై కెట్లువచ్చినది? ఆగ్లాసులో సగమువరకు మాత్రమే బ్రాంది యున్నదేమి? తక్కినసగ మేమైనది? మిగిలినది మీరు త్రాగలేదా? మీనోటిని వాసన చూడనిండు. త్రాగినదియు లేనిదియు వెల్లడగును.

రామారావు—(తనలో) గుట్టు వెల్లడైనది. ఇక దాచిన దాగదు. నిజము వచించి శారదను స్థిరచిత్తురాలిని చేసెదను గాక. (పైకి) ప్రేయసీ! శారదా! నీదగ్గఱ మర్మమెందులకుగాని నేడు నీరసముగా నుండుటచే, సద్దానిని ఓన్లీ వన్ కప్, ఒకటే పాత్రి సేవింపవలెనని యభిలాష కలిగి త్రాగబోయినమాట వాస్తవమే గాని, యంతలో నీవువచ్చుటచే విసర్జించితిని. ఇదియే జరిగినసంగతి.

శారద—నీరసముగా యున్నదని ఓన్లీ వన్ కప్ బ్రాందిని త్రాగ వలె ననుకొంటిరా? మొదట నందరు నీవిధముగ ప్రారంభించినవారె. అది రానురాను వృద్ధియై త్రాగుటకు చేత డబ్బులేనపుడు బ్రాందికి బదులు సారాయమును త్రాగి, మఱికొంతకాలమునకు నదియు కఱవైన కల్లుపాకలో దూటి తాటి యాకులపాయలో కల్లు పోయించుకొని త్రాగుటకు ప్రారంభించుచున్నారు. మొదట గోగుపుల్లలు కాల్చినవారే, పెద్దవారైనపిమ్మట చుట్టలకొలది పుగాకుచుట్టలను కాల్చుచున్నారు. రహస్యముగ బీడీలు చుట్టలు, సిగరెట్లు కాల్చిన కొంతబాలురు పెద్దవారైనపిమ్మట నవి కొని కాల్చలేక చుట్టలముష్టికి బయలుదేరుచున్నారు. చూచితిరా! పుగాకు కాల్చుట మాన్పించుటకు కాంగ్రెసుమంత్రులు దానికి హెచ్చు పన్నును విధించినను కొనువారును, కాల్చువారును హెచ్చగుచున్నారుగాని, తగ్గుటలేదు. తల్లిదండ్రులు తమస్వేచ్ఛావిహారమునకు బాలు రడ్డువచ్చెదరని నిద్ర నచ్చుటకుగాను నల్లమందు పిసరులను వేయుటవలన పెద్దవారైనను నాయభ్యాసము విడువకపోవుట వలన తాటికాయంత నల్లమందు పూటపూటకు మ్రింగుచు ధనవ్యయమునకు లోనై యనేకయిబ్బందులు పడుచున్నారు. మొదట మీ తండ్రిగారు బ్రాంది నౌషధప్రాయముగ త్రాగుట ప్రారంభించి యిప్పుడు ప్రతిదినము సీసాలు పీల్చివేయుచున్నారు. అంతటతో విడువక స్నేహితులతో బ్రాందీపార్టీలలో పాల్గొనుచున్నారు. కావున నీ పాడువ్యసనమును విసర్జింపుడు: కావలెనన్న.

తే. గీ. పావనంబగు గోవుల పాలు పిదికి
దాహశాంతికి క్షీరంబు త్రాగరాదె
మత్తువస్తువు లెల్లను మంచివగునె
చెప్పుడీ విందు మీరేమి చెప్పగలరొ.

రామారావు—ప్రేయసీ! శారదా! నీవాడినమాట లెల్ల నమృతోప
మానములు. ఇక ముం దెప్పుడు నిట్టిపని చేయను.

తే. గీ. అమృతవాక్కుల గురియు నీ యధర మంటు
నా పెదవితోడ నిక నెప్డు పాపపంకి
లమగు బ్రాందిని ముట్టను సుమి యటన్న
నమ్మదగు సత్యము వచించి నాడ సబల.

శారద—(సిగ్గుతో గూడిన చిరునగవుతో) సంతోషము. ఇక ముం
దెప్పుడును బ్రాందిసీసాను ముట్టనని చేతి చేయి
వేయుడు.

రామారావు—ఇంకను నీ కీయనుమానము పోలేదా? (అని చేతచేయి
వేసి) యింకెప్పుడు నీ బ్రాందిసీసాను ముట్టను.ముమ్మా
టికి ముట్టను.

(రామము ప్రవేశించును)

రామం—అమ్మా! అమ్మా! చెల్లాయి, చిట్టితల్లి లేచి ఏడుస్తుంది.

రామారావు—(భార్యవైపుచూచి) నీవువెళ్ళి ఉయ్యాలలో నిద్రించు
చున్న చిట్టితల్లిని లేవతీసికొని రమ్ము.

(శారద నిష్క్రమించును)

రామం—నాన్నగారూ! నాకు మూడుచక్రాల సైకిలు కొనిపెట్టరూ!

రామారావు—(కుమారుని యెత్తుకొని ముద్దులాడుచు) రామం!
సైకిలు కొనియిచ్చిన యేమి చేయుదువు?

(అంతట శారద చిట్టితల్లిని యెత్తుకొని వచ్చును)

రామం—నాన్నగారూ! సైకిలు ఎక్కి బడికి వెళ్ళి చదువుకొంటా
నండీ.

శారద—రామ మేమో కోరికలు కోరుచున్నట్లున్నాడు?

రామారావు—ఔను. సైకిలు కావలయునట.

శారద—అన్నట్టు మరచితిని. చిట్టితల్లి పుట్టినరోజు యీ వారము రోజు లున్నట్లున్నది. అప్పటికి నాల్గుయేండ్లు నిండి యైదవయేడు వచ్చును. ఆనాటికే దైన వస్తువు చిట్టితల్లికి చేయించెదరా?

రామారావు—(రామమును దింపి చిట్టితల్లి నెత్తుకొని ముద్దులాడుచు) చిట్టితల్లి పుట్టినరోజునాటికి బంగారుగొలుసు చేయించెదను. రామమునకు సైకిలు కొనియిచ్చెదను.

శారద—(సంతోషముతో) మననోములపంట లీయిరువురును. (తెరలో శారదా!) అత్తగారేలకో పిలుచుచున్నారు పోయివచ్చెదను.

రామారావు—రామంను, చిట్టితల్లిని గూడ లోనికి తీసికొనిపొమ్ము. నేను బజారునకేగి చిట్టితల్లికి గొలుసు చేయు ప్రయత్నము చేసి, రామంనకు సైకిలు కొనివచ్చెదను.

శారద—మంచిది (అని రామమును, చిట్టితల్లిని వెంటబెట్టుకొని వెడలును.)

రామారావు—(తనలో) నే నిక బ్రాందిని త్రాగనని శారదకు వచ్చింపుటకు "చాప్పతప్పి కన్నుతొట్టివోతా" నన్నట్లయినది. (కొంచెముసేపు తాళి) బ్రాందిని మరల త్రాగవలెనని కోరిక జనించుచున్నదే! ఏమి దీనివలన ముప్పు? త్రాగిన తప్పేమి గలదు? దేవత లమృతము త్రాగుట లేదా? గాన వారికి తప్పేమి వచ్చెను? ఇందు తప్పేమి యును లేదు. (అని బ్రాందిసీసాదరి కేగి) అయ్యో! మరల నీబ్రాంది త్రాగ దలచితినే! ఇక త్రాగనని శారదకు నమ్మపలికి చేతచేయి వేసి తిరిగి ఇట్టి పాపమునకు గొల్పవు గాదా? (కొంచెమాగి) ఇందు పాప మేమున్నది. ఓన్లీ వన్ కప్ బ్రాందిని త్రాగి బజారునకు పనిమీద వెళ్ళిన శారదకు [illegible]. ఇది [illegible] (అని గ్లాసులో బ్రాందినిపోసి త్రాగ [illegible])

ఉపన్యాసకుడు

ఉత్సాహావృత్తము.

బ్రాందితో సమానమైన పాన మెందు లేదనన్
సందియంబు లేదు లేదు సరసు లెల్ల వేడ్కతో
మందబుద్ధి మాసి పోవ మరల మరల త్రాగుచున్
జెందుచుంద్రు ముదము మదిని చింతలెల్ల బాయుచున్.

(నిష్క్రమించును)

తెరపడును.

# ఐదవ రంగము

(టానుహాలులో సభ. సభలో నందఱు కూర్చుండి యుందురు. అధ్యక్షుడు ఈశ్వరదత్తు లేచి నిలువబడి)

ఈశ్వరదత్తు—ఆర్యులారా! నేడు జీవదయామండలి సభకు నన్నధ్యక్షుడుగా నెన్నుకొన్నందుకు నే నెంతయు కృతజ్ఞతాపూర్వకవందన మాచరించుచున్నాను. గొల్లలమామిడాడ గ్రామము నుండి మనగ్రామమునకు జీవదయామండలి గౌరవకార్యదర్శి శ్రీ కరిరి అప్పారెడ్డిగారు విచ్చేసి యుపన్యాసము లీయవలెనని సంకల్పించుకొని యున్న సంగతి సభవారి కందరకువిశదమే. వారిచ్చునుపన్యాసమును శ్రద్ధతో వినవేడుచున్నాను. చాలదూరమునుండి యట్టిమహాత్ములు విచ్చేయుట మనయదృష్టమునవచ్చును. అప్పారెడ్డిగారి యుపన్యాసమైన పిమ్మట మరల నుపన్యసింతును. (అని కూర్చుండును)

అప్పారెడ్డి—(లేచి నిలుచుండి) అగ్రాసనాధిపా! సభాసదులారా! నా యుపన్యాసమును శాంతముగా విని విమర్శింతురు గాక. నానాటికి మనదేశ మెంత దౌర్భాగ్యస్థితిలోనికి వచ్చుచున్నదో గ్రహించితిరా? రోజున కొక్క—

తే. గీ. రాగిడబ్బును దేలేని జోగిగూడ
దూర్పుదిక్కున సూర్యుడు దోచకుండ
కాఫి త్రాగంగవలె నంచు కాఫిహోటలు
జేర పరుగిడు నెవ్వరు జేరకుండ.

మరియు.

తే. గీ. కాఫి త్రాగిన వెంటనే కారకిళ్ళి
నోట బెట్టుచు సిగరెట్టు సీటుగాను
వ్రేళ్ల సందున నిరికించి వేడ్కకాంద్ర
తోడ స్వేచ్ఛగా కాలంబు గడపనెంచు.

ఈ కాఫీపిశాచ మావహించినది మొదలు కాఫీహోటళ్ళు హెచ్చగుచున్నవి. దానికి తోడు.

తే. గీ. చదువు సంధ్యలు లేనట్టి చవటగూడ
షూటు బూటును హేటును కోటువైచి
చేత బెత్తంబు పట్టుచు సిగ్గు వీడి
తెల్లదొరలపోల్కినియు చెల్లుబడియె.

ఇట్టివారినిజూడ నా కసహ్యముగానుండును. వీరివేషము పులిని జూచి నక్క వాతలు పెట్టుకొన్నదన్నచందమున నుండును. (కొంచ మాగి) ప్రపంచమున నింకను నెన్నో చిత్రములు గలవు.

తే. గీ. బైసుకోపను యంత్రంబు బయలుదేరి
రమ్యమగుసీను జూపించు రాత్రులందు

దద్దయును మంచిగల్లదంచు పెద్దలంద్రు
నెంచిచూచిన కొంతైన మంచితోచు.

తే. గీ. కూలినాలియుచేసియు కూడబెట్టి
జూడనెంచును సినిమాను చోద్యమంచు
కష్టజీవులుకూడ నాకాంక్షతోడ
మంచిలేకున్న వారలు మానరొక్కొ?

ఇంకను కొందరు,

తే. గీ. భాగ్యవంతులబిడ్డలు బనియులేక
దినియు గూర్చుండి దోచక యనుచరులను
వెంటబెట్టుక నడవికి వేటలాడ
జనుచునుందురు మృగముల జంపుకొఱకు.

తే. గీ. క్రూరమృగముల జంపిన క్రూర మనరు
యితరులకు హాని జేయక నిలను బెఱుగు
లేళ్ళ దుప్పుల జంపిన లేదు ఫలము
సాధుమృగముల జంపుట సరస మగునె?

మృగయ్యాఖేలనమే వారియానందము. అవి ప్రాణభీతి నరచుచు పరువెత్తుచుండ కుక్కల నుసుకొల్పియు, తుపాకుల గాల్చియు నంతమొందించియు సంతోషింతురు. అవి బ్రతికియుండుట వారికేమి బరువో గాని,

తే. గీ. కొందరు పనిచేయుటకును కుందికుంది
పొద్దు గడువంగవలెనంచు హద్దు మీరి
జూదమాడుట మంచిగా జూచి యహహా
యన్ని వేళల నాడుదు రఖలగతుల.

అందులో పేకాట మరీ ముప్పు తెచ్చుచున్నది. మూడుముక్కలాట బయలుదేరి యైశ్వర్యమునంతను ముక్కలు చేయుచున్నది. మరియు,

తే. గీ. కోడిపుంజుల బెంచియు నేడు గొప్ప
పందెములు వేసి యానంద మందజూతు
రదియు న్యాయంబె దా బెంచి నందు కకట
దయను జూపర దేలకో దానిమీద.

ఈకోడిపందెములమాట జ్ఞాపకమునకు వచ్చినపుడెల్ల నామనస్సు పరి పరివిధముల పోవుచుండును. బీదవానికి అలారం టైమ్‌పీసువలె వేకువజామున మెలకువ వచ్చునట్లు కొక్కరోకోయని కూసి మేల్కొలుపు నీకుక్కుటములకాళ్ళకు కత్తులు కట్టి రణరంగమున వదలివేయ నవి వీరావేశమున శూరునిపోల్కి పోరి, పోరి కూలుట చింతనీయము. అవి పోరిపోరి మడియుట పెంచిన యజమాని కానందము. ఆహా! మానవు లెంతనిర్దయులు. పెంచి పెద్దవానినిజేసి యీవిధమున హింసించుట వాని కెంత యానందదాయకము. కోడిపుంజులకు కత్తికట్టి వదలునట్లు వారలను వదలినప్పుడు వారిశూరత్వము వెల్లడియగును. ఈకోడిపందెములమూలముననే సవతితలుల బిడ్డలైన పలనాటివీరులు రాజ్యమును గోలుపోయి రణరంగమున నశించిరని పల్నాటివీరచరిత్ర చాటుచున్నది. మరియు విజయనగరరాజును, బొబ్బిలిరాజును కోడి పందెములమూలముననే వైరము పెంచుకొని యుద్ధమున నిహతులైరని బొబ్బిలిపాట వెల్లడిచేయుచున్నది. అయినను యీకోడిపందెములపిచ్చి మానవులను వదలకున్నది. భాగ్యవంతులును, వెలమదొరలును గొఱ్ఱెపోతులపందెములువేసి పైపందెములకని తమయాస్తిని పాడుచేసుకొనుచున్నారు. ఇట్టిపిచ్చి యింకను వారిని విడువకున్నది. ఇంకను లోకములో నెన్నో విచిత్రములు గానుపించుచున్నవి. ఇది యొకజాలికరమైన సంగతి.

తే. గీ. కోళ్ల మేకల గొఱ్ఱెల గొంతుకోసి
సమ్మవార్లకు సర్పింతు రదియు మేలె?

అమ్మవార్లకు రక్తమే యారగింప
నితర మేదైన దేవికి యింపుగాదె?

అమ్మవార్లెవరు? దేవి యెవతె? యీజంతుబలు లేమి. ఇది కూడ నాశ్చర్యమైన సంగతియే. అసలు యీశ్వరునిభార్యయైన పార్వతిని; చండిక, హైమవతి, కాళి, దుర్గ, శక్తిదేవి, యీశ్వరి యని పిలుచుట వినుపించుచున్నది. లోకపాలకుడైన శంకరుని యర్ధాంగికి మాంసాహారము, రక్తపానము, నరబలులు యేల కావలసివచ్చెనో తెలియదు. విష్ణునియాజ్ఞానుసారము రేపల్లెలో యశోదగర్భమున నుద్భవించినమాయ కంసునిహస్తములనుండి భూమింబడక గగనంబున కెగిరి మాయ మయ్యెననియు, నామెను దేవతగా యుపహారము లొసంగి సతులుపూజించునట్లు విష్ణుడు వరమొసంగెనని భాగవతమున గానిపించుచున్నది. ఇట్లు వీ రిరువురుండ మహాలక్ష్మి, పల్లాలమ్మ, దండుగంగమ్మ, నూకాలమ్మ, బళ్ళమ్మ, మరిడమ్మ మొదలగు పేర్లతో విహరించు నీదేవత లెవరు? వీరికి రక్తమాంసములే యాహారమన్న పళ్ళాలమ్మకు జంతుబలు లొసగక ఫలాహారములే యొసగుచున్నారు. యీయామె కివి యేల యిష్టమయ్యెనని తలపోయ యాదేవతలందరు దేవతలుగాక; పూర్వము రణరంగమున వీరస్వర్గ మలంకరించినవారిభార్యలు, భర్తలతో సహగమనముచేసి యుత్తమకాంతలుగ దోచుచున్నారు. అట్టి వీరపత్నులకు జంతుబలు లేలకావలసివచ్చెను. ఇదియంతయు మూర్ఖమానవుల పెట్టినమ్మకము. వారందరు దేవతలే యైన ఫలహారములను పసుపుకుంకుమలతో పూజించుట మంచిది. మరియు తమపిల్లలకు జబ్బుచేసిన యమ్మవారికి జంతుబలి వేయుదుమని మొక్కుకొందురు. తమపిల్లలకోస యొకజంతువు జీవనము తీయుట యేమిన్యాయము? ఇదియునుగాక,

తే. గీ. మఱియు కొందఱు పురుషులు మతియులేక
కల్లు సారాయి బ్రాందిని కై పుకొఱకు
కోడిమాంసపు నంజుళ్ళు కోరుకుకొనుచు
త్రాగుచుందురు ప్రీతిచే దప్పితీర.

ఈ త్రాగుడువ్యసనమున్నదే యిది లోకమును మలమల మాడ్చివేయుచున్నది. త్రాగుటవలన యెన్ని సంసారములో దిబ్బ యగుచున్నవి. త్రాగుమోతుల భార్యాపుత్రు లెంద రెందరు తినతిండి కట్టబట్ట లేక మలమలమాడిపోవుచున్నారో గ్రహించితిరా?

తే. గీ. ఇంట రంభను బోలిన యింతియున్న
జుల్కనగ జూచి వెలయాలి జూపులకును
దాసుడగు నది యేలనో? దైవమాయ
దాటతరమగునే యిక తథ్యముగను.

ఇట్టిదుర్వ్యసనములకు లోనైన వారిని మంచిమార్గమున ప్రవర్తించునట్లు చేయుటకు మన మెల్లరమును సంఘముగా నేర్పడి ప్రబోధించుట మంచిది. అట్లు చేసిన దౌర్భాగ్యస్థితికి వచ్చిన మనదేశము, మనప్రజలు బాగుపడుదురు. మనసేవకు భరతమాత సంతోషించును. అట్లు దేశసేవ చేసినగదా? భారతమాతపుత్రులమని చెప్పుకొనుటకు సంతసింపవలసియుండును. లేనియెడల మనదేశ మింకను నధోగతికి బోవ పాల్పడుననుట కెంతయు సందియములేదు. యింతటితో నుపన్యాసమును విరమించుచున్నాను. భారతమాతకు జై. గాంధిమహాత్మునికి జై. (కరతాళధ్వనులు) అప్పారెడ్డి యొకయాసనమున కూర్చుండును. (అధ్యక్షుడు యీశ్వరదత్తు లేచి నిలువబడి.)

ఈశ్వరదత్తు—శ్రీఅప్పారెడ్డిగారు నేటిసభలో నిచ్చిన యమూల్యోపన్యాసమును వేనోళ్ళకొనియాడినను తనివితీరదు.

దేశము నేడు వ్యభిచారముతోడను, త్రాగుడుతోను నధఃపాతాళ మున బడుచున్నది. మరియు బుద్ధభగవానుని ధర్మసూత్రములలో "అహింసా పరమోధర్మః" అనునది ఉత్కృష్టధర్మము. అట్టిచో జంతుబలులు, జీవహింసలు జేయు టన్యాయము. కావున మనమెల్ల రము నట్టిధర్మముల నాచరించుచు సంఘములుగానుండి దేశము నుద్ధ రించుట పరమధర్మము. అప్పుడే మనమెల్ల భారతమాతపుత్రుల మని పించుకొందుము. ఇట్టిదేశసేవ చేసినవారే మహాపురుషు లనిపించుకొం దురుగాన, మనమెల్ల దేశసేవకులముగ తయారగుట మంచిదని నా యుద్దేశ్యము. [ఇంతటితో నాయధ్యక్షోపన్యాసమును విరమించు చున్నాను.]

భారతమాతకు జై. గాంధిమహాత్మునకు జై.

[అని కూర్చుండును. కరతాళధ్వనులు]

సభ ముగియును.

తెరవ్రాలును.

---

## ఆరవరంగము

---

(వీరయ్య అను రైతు రెండుబక్కెడ్లతో ప్రవేశము)

వీరయ్య—ఏం! ఎగసాయాలు! ఆర్పులభావిడేగాని నూర్పులభావిడులు సున్న. అందరు రైతోణ్ణే పీక్కుతింటారు. నాల్గొండ లిచ్చినా కాడెడ్లు రావటంలేదు. కూలాడికి కుప్పనూర్పుకి రోజుకి

మూడురూపాయిలు కావాలట. ఇంకేటి ఎవసాయం. నారాయణ్ణారా ణా! (ఆవలించి) రాత్రల్లా నిదురలేదు. నల్లమందు పాణం! (ప్రక్క చూచి) ఈబక్కలిని కటికోడినా అడిగేటట్టు లేదు. (ఆవ లించి) ఎక్కడేనా కాన్ని మెతుకులు దొరికితే బాగుండును. మూల యిరాట్టులకే నాశొత్తే ఉచ్చయిగ్రహాలకు దద్ధోజనం ఏలావస్తుంది. పట్టుమని బ్రాహ్మడికే పట్టెడుమెతుకులు దొరకడంలేదు. ఇక నాబోటి వాడికా! ధర్మసత్రాలన్నీ ధర్మరాజులతోటే పోయాయి.

సాహేబు—ఏమండీ పెద్దకాపుగారు! ఈటి నిక్కడ నిలదోలినారేం! అమ్మతారేమిటి, యీటిని? గుప్పెడుమాంసమేనా లేదేమయ్యా ఒకదానొంటిని. దూళ్ళని గుమ్మ లిరిగేదాకా దుక్కిలో పెట్టి దూళిచేసేశావేం బాబు. ఏవ్వారేమిటి?

వీరయ్య—(ఎగా దిగా చూచి తనలో) ఈతడు నే ననుకొన్న బాపతు సాహేబులాగే అనుతున్నాడు. (ప్రకాశముగా) ఏవ్వా రైతేం బాబు నీకు.

సాహేబు—అడగడం తప్పేనటయ్యా! అమ్మేవాణ్ణి కొనేవాడు కొనే వాణ్ణి అమ్మేవాడు అడుక్కోకుండా ఏలాగ వ్యవ్వా రం. ఇది సంత!

వీరయ్య—(తనలో) వీటి నింతవరకు అడిగినవాడొక్కడూ లేడు! తుదకి వీటియోగం వీడిచేతుల్లోకే పోయేలా కనబడు తున్నాయి!

సాహేబు—ఏం మాటాడవేమయ్యా! మళ్ళీ యీటి నింటికి తోలు కొని పోదామనుందేంటి. ఊరుచూసేదాకా ఊపిరుం టేగా వాటికి.

వీరయ్య—(తనలో) అవును. సాహేబుమాటలూ సత్యమనేతోస్తుంది. అడుగులేసి అడుగుపెట్టలేకుంటే తిరిగి అడంగుకెళ్లా

చేరతాయి. పాపపుణ్యాలకోసం చూస్తే ప్రపంచం యెలా నడుస్తుంది. దేముడు దేని కెల్లా రాసిపారేశాడో ఆలా జరగవలసిందే! దాన్ని తప్పించేవా డెవడు.

సాహేబు—ఏమయ్యో కాపు! మతిపోయిందేమిటి మాట్లాడడం లేదు. తరిచడిగితే తటపటాయించడం! ప్రతీవాడికి ఉన్న జబ్బే యిది. ఎల్లు యెల్లు! రెంటికీ చెడీయోగం నీకంటే నామాట యినపడద్దా! (నిష్క్రమణ మభినయించును.)

వీరయ్య—ఓహో యితడు దారితీయుచున్నట్లున్నది. మొదటికే మోసమొస్తే వీడు చెప్పినట్లు మొగాన్ని గుడ్డ వేసుకొని మొర్రో అనవలసిందే! (ప్రకాశంగా) ఏమయ్యో సాహేబుమాట!

సాహేబు—ఏంమాట. పిలిచినప్పుడు లేదు. మరో బేరమేనా చూచుకోవద్దా! అయితే మీ అభిప్రాయ మేమిటి?

వీరయ్య—నువ్వు చెప్పవయ్యా?

సాహేబు—వస్తువు నీది! చెప్పడం నేనా? ఏమి సరసంగా ఉందయ్యా!

వీరయ్య—ఏభై అయితే.

సాహేబు—నవ్వుచు ఏభైయా. చాలుచాలు నీమొగ మెప్పుడు ఏం తెరగదమకుంటానేం! (పోబోవును.)

వీరయ్య—మరేమిటి నీయభిప్రాయం! వెళ్ళిపోకయ్యా!

సాహేబు—ఏభై రూపాయ లొద్దిలిపెట్టి ఏభై దమ్మిడీలుకూడా రావు. ఏదయ్యా! గుప్పెడుమాంసం.

గీ. ఊపిరున్నంతకాలము మేపు పెట్టి
పనికిరాకున్న కట్రాట పస్తువెట్టి
మేము కోయుదు మనుటయే మిగులుగాని
ఏమిప్రాణాలు యీటికి ఈరబాబు.

వీరయ్య—ఇక అయిఅన్ని ఎందులకు సాయిబూ నలబయిరూపాయి
లియ్యి.

సాహేబు—నలభయ్యిలేవు గిలభయ్యిలేదు. ఇష్టమైతే రెండుపుంజీ
లిస్తా. ఆపైని మీయిష్టము. (ప్రక్కచూచి) అదేటి
ఆకరిది నిలబడలేక కామోసు తొంగుంటుంది.

వీరయ్య—రామరామ ఏందారుణం నలభై వరాలు పెట్టికొన్నది.
నాలుగువరాలైన లేవు. ఎరక్క తోలుకొచ్చాను.
అమ్మబోతే అడివి కొనబోతే కొరివి క్రిందఉంది ఈసంతబేరము.

సాహేబు—ఏం పోమ్మంటావా. ఈటివరస సూత్తే రేపీపాటిదాకా
పాణాలు నిలబడే టట్టులేవు. మీకీయోగముంటే ఈ
నాలుగుడబ్బులైనా దక్కించుకో (పోబోవును)

వీరయ్య—(తనలో) అదీ నిజమే. (ప్రకాశముగా) బాబూ నామాట
విను చాలడబ్బుపెట్టికొన్నాను. కొంచె మాలోచించు.

సాహేబు—నీకిష్టమైతే రెండుపుంజీలిత్తాను. మాకీ జూటామాట
చెప్పాము. వేదుకబేరాలూ లేవు. ఒక్కటే మాట
మాదీ. యింతకీ మావాడు వప్పుకోవాలి(పోబోవును)

వీరయ్య—(తనలో) అయ్యో తుదకీబేరము బుసికిపోదుగదా. నా
పని ఎందునూ పొందకుండా వచ్చినదే? ఇంటిదగ్గర
ఆదుది అఘోరించుతూనే ఉంది. (ప్రకాశిముగా) సాయిబూ తే
రూపాయలు.

సాహేబు—(రూపాయలిచ్చి ఎడ్లకు కట్టినతాళ్ళను పట్టుకొనును.)

వీరయ్య—(రూపాయలు లెక్కపెట్టుకొనుచుండును.)

(జీవదయాప్రచారకుడు అప్పారెడ్డి ప్రవేశము.)

అప్పారెడ్డి—

తే. గీ. త్రాగు చోకమూల పేకాట దాని పొంత
జీవహింసయు నూరూర జెలగుచుండె
ధర్మ మారయ రొక్కరు దయయు లేదు
ఎంతచెడిన కరుగదు సుంత మనసు.

ఆహా! కాలగతి ఎన్ని విధముల ప్రబోధ మొనరించుచున్నను యింకను యీజీవహింసాదురాచారము మొదలంట మాయకున్నది. కృషితో నాస్తి దుర్భిక్షమన్నట్లు, కష్టే ఫలే యన్నట్లు ప్రాణము లున్నంతదనుక 'పట్టుపట్టరాదు. పట్టివిరువరాదు' అని ప్రహ్లాదుడు నుడివినట్లు సాధనముచే సర్వకార్యములు సానుకూల మొందగలవు. విరక్తినొందరి విజయ మాసించుట వెర్రికదా! అదుగో! నాయెదుట కానవచ్చు నాముదుసలియెడ్లజంట వధ్యస్థానమునకే గొంపోబడు చున్నట్లున్నది.

[తెర లేచును]

అప్పారెడ్డి—అయ్యా వీరయ్యా యిది యెట్టిధర్మము మొన్ననే కదా విరాగాశ్రమములో జీవదయామండలిని నెలకొల్పి నా చేసిన యుపన్యాసమునకు యెట్టిజీవహింసయు చేయమని యభయహస్త మొసంగియుండిరి? ఇంతలోనే మరచి యుండిరా?

వీరయ్య—మీ దేయూరు బాబూ మేం ఏం తప్పుచేసాము మీరు మరొకర్ని సూచి ఉండొచ్చు.

సాహెబు— ధర్మంయేంటీ చేసేయి ప్రాతస్తానాలు దూరీయి దొమ్మడి గుడిసెలు ఆసేట్లు చెప్పటం సులబమేనయ్యా చెయ్య

టం కష్టముకాని ఎంతమంది యీచెప్పినవారిలో అంకినప్పుడు అర్ధ శేరుమాంసం అరడాము అసలుసరకుతో ఆరగించటంలేదూ? నువ్వంటే నువ్వుకాదులే!

వీరయ్య—ఈమద్దిని మాఊళ్లోనూ మీలాంటాయనే ఇంకోఆయ నొచ్చి సంఘం ఏర్పాటుచేసాడు. కొంతమంది పెద్ద లను నియమించాడు. కాని బాబూ జింహ్వా చాపల్యముకాదూ. పుట్టినికాడినించి తింటున్నపదార్థం మా ఊరిలోనిపెద్దలు పాపం యింట్లో యినకపోయినా ఈదులోయిప్పిచెపుతుంటారు యీధర్మాలు.

అప్పారెడ్డి—అయ్యా! అదియదార్థమే యైయుండవచ్చును. ఒక్కతల్లి గర్భమున యుదయించిన పుత్రులంద రొక్కరీతిగ యుందురా? మనమేదేని యొకవస్తువును కొనబోయినప్పుడు జంగిడి లోని మంచివస్తువు నేరి తీసికొందుము. అట్లే ప్రకృతియందుగల మంచినే మనము సామ్యముగా గొనుట ధర్మముగాని చెడుగును గై కొందుమా?

గీ. తన్ను ఛేదించు నరునకు తప్పు గనక
ఛాయ నొసగదె వృక్షంబు సమతతోడ
అట్లె మహనీయులెల్లరు అమలమతిని
చేతు ముపకార మీధాత్రి శ్రేష్టమగుట.

అయ్యలారా సకలమతముల యొక్కయు మూలధర్మమొక్కటియే, ధర్మమే దైవస్వరూపము. సకలాత్మలయందు ప్రకాశించు తేజమే దైవము. జీవి జ్ఞానియైనచో తనయందుగల దైవము నెరుంగుచున్నాడు. మంచిచెడ్డల రెంటిని విమర్శించి ధర్మమార్గము నవలంబించు నాతడే పూజ్యుడు. వానిదే జన్మ.

గీ. బుద్ధి పురిగొల్ప నాత్మ దా బుజ్జగించి
మంచిచెడ్డల భేదంబు నెంచి మించి
సత్పథంబును బోధింప పూతమాను
దేవదేవుండు మెచ్చును భావమలర.

మిత్రులారా! మనము వృద్ధులమైనపిమ్మట మనపిల్లలు మనల నిట్లే చేయుదురా? మనవలన యుపయోగమున్నను లేకున్నను పిత్రుపూజ సల్పుదురేకాని, ధన మార్జింపడనియు, ఊరక మూడుపూటలు తిని కూర్చుండుననియు, హేయముగ జూచి, తిట్టి, కొట్టి, అన్నమిడక జంప గమకింతురా! విశాలవిశ్వంభరాచక్రమున వృద్ధులే దైవములని మనపురాణము లెన్నిభంగుల చాటుచుండుట లేదు.

పర్వదివసములందు మనవారెందరు పసుపు కుంకుమాదులచే నీగోసంతతిని పూజించుటలేదు. 'గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం' అని మన మెరిగియున్నదేగదా!

కాలిలో విరిగినముల్లునకే మనప్రాణము ఉస్సురని కొట్టుకొను చుండ బలిమిమై నిండుప్రాణములను కరకుకత్తితో ఛేదింప నానోరు లేనిజీవి యెంత కొట్టుకొనునో గదా!

మనకువలెనే వృద్ధాప్యమున నాల్గుదినములు సుఖింపవలెననెడి యాస లేకుండునా!

గీ. పాడిపంటల నిచ్చుచు పాలకునకు
ముదిమి యేతేర మూల్గుచు ముక్తిగనగ
అట్టి పశువుల మీరేల మట్టుబెట్ట
జూతురేలకొ దయలేద మిత్రులార!

(సాగిలబడి మ్రొక్కి- అయ్యా! నామొరాలింపుడు వలయుచో ధనము నేనిత్తును. మన రైతుసంఘములచే నెలకొల్పబడిన గోరక్ష

కాశ్రమములు పెక్కులు గలవు. వీటి నచ్చుటకు తేర్తము రండు. ఈ బ్రతికిన నాల్గుదినము లైనను వాటి నింత సుఖింపనిండు.

(వీరయ్య, సాహేబులు అతనికి నమస్కరింతురు.)

సాహేబు—అయ్యా! యధార్థం చెప్పితివయ్యా! కేవలం నువ్వు బుద్ధదేవుడివే! నే నావూళ్ళలో చూశానయ్యా నీశ్రమలు. నేటితో నాకూ మనస్సు కరిగిపోయింది.

గీ. పుట్టినప్పటి నుండి నే పూనుకొంటి
తలలు గోయుటేగాని ని తర మెరుంగ
నేర్చినాడను తప్పంచు నేటి కార
ఒట్టు పెట్టితి నీకత్తి ముట్ట నింక.

(కత్తి పారవేయును.)

ఏమయ్యా! వీరయ్యకాపు. ఏం మహానుభావుడయ్యా! అపు రలవ్వలాంటి ఆముక్కలు. నిలువున నీరై పోయింది. మనమూ రేపు నచ్చిపోళ్ళమే! పద యీాయన కూడా పోదాం!

అప్పారెడ్డి—బాబూ! రండు దయచేయుడు ప్రజాసేవ చేయుటకంటె పరమోత్కృష్టమైన భాగ్యము మరేదిగలదు. నేటికీ ఇంకనుచాలవరకు జీవదయాసంఘములు నెలకొల్పబడియున్నవి. ఇంకను మరికొన్ని గ్రామములయందు యిట్టిసంఘములు స్థాపింపవలసి యున్నవి. (సంతలోని జనులందరు) జై జై శ్రీ అప్పారెడ్డిగారికిజై శ్రీ జీవదయామండలికి జై.

తెరవ్రాలును

---

# ఏడవరంగము

---

[గోవిందరాజుగారి యింటియొద్ద త్రాగుడు పార్టి]

(గోవిందరాజుండగా తెరలేచును)

గోవిందరాజు—(బ్రాందిని కొంత సీసాలో పోసి)

మత్తే. పుట్టి పుట్టదు బ్రాంది మించగబోలు త్రాగుడు మేదినిన్
యెట్టివారలకైన నియ్యది యెంతో మేలును జేయుచున్
గుట్టువెల్లడి చేయకుండగ గూర్చుచుండును మోదమున్
నట్టిదానిని బొజ్జనిండగ నారగించుట యొప్పదే.

(అని త్రాగి) ఈవేళ బ్రాందీపార్టీయని ఫ్రండ్సు కాహ్వానము పంపించినా యింకా యెవ్వరూ రాలేదు. వేళ యతిక్రమించుచున్నది. వారు వచ్చేవర కాగడ మెందుకు. నాపని నేను కానిచ్చేస్తా. (అని మరల త్రాగి) ఇప్పటికీ కొంచె మందుకొంది పోర్సు. (తూలుచు) మాటలు తడబడుతూ ఫ్రండ్సు వస్తారని బ్రాందీసీసాలు తెప్పించడమే గాకుండా కోడిమాంసపు కైమాచీకులు, చీకులు, రొటిశొర్వ్వ, పిట్ట మొదలైనవికూడా తయారుచేయించి జాగ్రత్తచేయించా. ఇన్ని పార్టీ సమయములో యందించడానికి రామాభాయిని (భోగముది) పుర మాయించాకాని, యింకా యెవ్వరూ వచ్చుచున్నట్లు లేదు. (అని ముందునకు చూచి) అదిగో! కామేశ్వరరావు, వెంకాజి, రమణారావు, గోపాలం వస్తూఉన్నారు. వారికూడా రామాభాయి వస్తూంది. ఇంకేం, ఈవేళ నాయానందం వెల్లడిచేయడానికి సమయం దొరికింది.

(అంతట కామేశ్వరరావు, వెంకాజీ, రమణారావు, గోపాలం రామాభాయి ప్రవేశిస్తారు.)

గోవిందరాజు—ఓహో! వచ్చారా? మీరాలస్యం చూచి రారేమో యనుకొన్నాను.

కామేశ్వరరావు—సరిసరి. మీరు పిలవడం, రాకపోవడం కూడానా? ఎంతమాటన్నారు.

వెంకాజీ—ఆలస్యమైనందుకు మన్నించండి.

రమణారావు—ఈమర్యాదలకేమిగాని, యేమేమి తయారు చేయించారేమిటి పార్టీకి?

గోవిందరాజు—తినబోతు రుచడుగుతారేమి? మీకే తెలుస్తుందిగా.

గోపాలం—ఇప్పటికే యాలస్యమైంది. మాటలతో కాలక్షేపం చేస్తారేం. కార్యక్రమం కానీయండి.

గోవిందరాజు— కార్యక్రమాన్ని కానియ్యడానికి నాదేమీ యాలస్యము లేదు ఆలస్యమంతా రామాభాయిదే. (రామాభాయిని చూచి) రామాభాయీ! పూర్వం దేవతలకు రాక్షసులకు జగన్మోహిని యమృతము పంచియిచ్చినట్టు, యీబ్రాందీని, నీమృదు హస్తాలతో యందించు. అల్లా నీవిస్తే త్రాగేవాళ్ళ కెంతయానందంగా యుంటుం దనుకున్నావు.

రామాభాయి— చిత్తం. చిత్తం. నన్ను జగన్మోహినిగా పోల్చారన్న మాట.

గోవిందరాజు— ఓహో! నీవు నిజముగా జగన్మోహినివే. అందులకు సందేహమా?

క. చక్కదనంబున నీకెన
నిక్కముగా లేరు భువిని నెఱజాణవునై

మక్కువ గోల్పెద వెంతయు
నక్కజమా కరణి సానులందున బాయీ!

అట్లాంటప్పుడు నిన్ను జగన్మోహినిగా పోల్చానంటే తప్పేముంది.

రామాభాయి— ఇదియంతయు మీాదయ.

వెంకాజీ— ముందు పని కానియ్యండి.

గోవిందరాజు— రామాభాయీ! ముందుసంగతి చూడు.

రామాభాయి—(బల్లమీాదగల బ్రాందిసీసాను తీసి గ్లాసులో బోసి) ముందుగా గోవిందరాజుగారే స్వీకరించాలి. (అని యందించును)

గోవిందరాజు—(ఆనందముతో) ముందు నన్నే త్రాగమంటున్నావా? సరే తే అని యందుకొని త్రాగును.

కామేశ్వరరావు—మాకుకూడ నందించు చురుకుగా.

రామాభాయి—చిత్తము. (అని బ్రాందిని మరియొకగ్లాసులో బోసి,

ఉత్సాహవృత్తము—

సరసులార యందుకొనుడు చల్లగాను బ్రాందినిన్
మరచి నేను నీయకున్న మరల యడిగి యైననున్
(అని కామేశ్వరావున కందించును)

కామేశ్వరరావు—(అందుకొని యానందముతో) ఓహో! యింకేమి? పాటలుకూడ పాడుతున్నావు. నేడు నీవునిజముగా జగన్మోహినివే (అని త్రాగును)

రామాభాయి— ధరణియందు దీనిమించి త్రాగదగిన దెద్దియున్
మరల మనము చూడలేము మాట లెన్ని చెప్పినన్.
(వెంకాజీ కందించును)

వెంకాజీ—వహావ్వా! నీవు నిజముగా జగన్మోహినివే (అని త్రాగును)
ఉత్సాహవృత్తము.
ముదము నిచ్చు బ్రాంది త్రాగి ముద్దు లొసగ వేమిరా!
మదనసాయకాంగిమాట మదిని మరచి తేలరా!
(అని పాడి రమణారావున కందించును)

రామాబాయి—(మరల నొకగ్లాసులో బోసి గోపాలాని కందించును.)

గోపాలం—ఉత్సాహ—
రొదను గోరుచుండు నిన్ను ఇంతజాగ దేలరా!
సదయహృదయ దయను జూపి సరసనుండ నియ్యరా!
(అని త్రాగుచు) గుమ్మైపోతూంది.

గోవిందరావు—ఇప్పటికి ఓస్లీవన్‌కప్ అయింది యీామారు ఇంకొక గ్లాసిచ్చి ఫలహారముకూడా యిమ్ము.

రామాబాయి—చిత్తం (అని మరల నొకగ్లాసు బ్రాందినిచ్చి) ఇదిగో దీనిని రుచిచూడు కైమాచీకు బహు మజాగా తయారైంది (అని యాడించును) ఇవిగో యివి కోడిమాంసపు పకోడీలు. వీటిని రుచిచూడుడు.

రమణారావు—నీచేతితో నిచ్చిన కోడిమాంసపుపకోడీలు, కైమా చీకులు మంచిరుచిగా వున్నాయి.

రామాబాయి—అట్లయిన నిదిగో మరల నింకొక గ్లాసు బ్రాంది నొకగుప్పెడు మాంసపుపకోడీలు తీసికొనుడు.
(అని యాడించును.)

కామేశ్వరరావు—(త్రాగిన మత్తతతో మూల్గుచు) రామాబాయి నీసౌందర్యముచూస్తే కనులు మిరుమిట్లుగొల్పి నాహృదయమును నాకర్షించేస్తున్నావు సుమా! నీవుకూడా రవంత మాతో పాటు ఓస్లీవన్‌కప్ సేవించు.

గోపాలం—మాళందరకు నందించేసరికి నీ నలసిపోయేవు. కొంచెం బ్రాంది పుచ్చుకో (అని మాటలు తడబడుచు పలికి) నీజగన్మోహనాకారంచూసేసరికి—మన్మధుడు—తన—పంచబాణములు—వేస్తున్నాడు — ఒకసారి నీ - నీ — యధరసుధా — ధా — రసము కూడా త్రాగనిమ్మ

కామేశ్వరరావు—(తూలుచు)నీయందానికి నీచందానికి రామాబాయి యధరరసముకూడానా? నోరుమూసుకోనీ—ఊరుకో నాలాంటివాళ్ళన్నా చెల్లుతుంది.

రమణారావు—(తూలుతూ) మీాయిద్దరి అందానికీ—ఒక్కరిని ఒకరు దెప్పుకోవడం— కూ—డా—నా నాలాంటివాళ్ళన్నా అందంగా వుంటుంది. రామాబాయి నన్నే ప్రేమిస్తుంది.

వెంకాజీ—(తూలుతూ) మీా అందంచూచి మోసపోయేటందుకు రామాబాయి, తెలివితక్కువది గాదు— నేనంటే— మక్కువ కాదు. రామాబాయి.

గోపాలం—సీకొంగమెడ— చూచి— మురిసిపోతూందిరా— రామాబాయి!

వెంకాజీ—నీపిల్లికళ్ళు చూచి మోహిస్తోందిరా రామాబాయి!

గోపాలం—నాపిల్లికళ్ళు— కంటె— నీకొంగమె—డ—లో వుంది— అందం— నోరుముయ్యి లేకపోతే— గోపాలాని కాగ్రహం వస్తుంది?

వెంకాజీ—నన్ను నోరుముయ్యమంటున్నావా—పేరి పశువా— (అని తూలుతు వెళ్ళి చెంపకాయ కొట్టును)

గోపాలం—(కోపముతో) నేను పశువునైతే—నీవు దున్నపోతువా? చెంపకాయకొట్టేవు చూడు,నామజా (అని అక్కడ కుర్చీని పైకెత్తి వెంకాజీ మీాదకు విసరును)

రమణారావు—ఓరి! త్రాగుబోతుల్లారా! ఏమిటీ అల్లరి (అని వారించబోయి తూలి అచ్చటనున్న బల్లమీాద పడును. బల్లక్రింద పడుము)

కామేశ్వరరావు—మేము త్రాగుబోతులమైతే—నీవు యీాబల్లమీాషికారై యీావేమిటి రమణా!

రమణారావు—(లేచి) నే - నేను త్రాగ్రబోతైతే. కామేశ్వర్రావు నీవెవడవురా (అని అక్కడగోడకున్న అద్దము లాగి విసరికొట్టును)

(అంతట అప్పారెడ్డి ప్రవేశము)

అప్పారెడ్డి—(తనలో) గోవిందరాజుగారి గృహమిప్పు డెంత భీభత్సముగా మన్నది. ఇది యంతయు బ్రాంది మహాత్మ్యమై యుండును. కుర్చీలు, బల్లలు, అద్దములు, తునకలై పడియున్నవి. యీాపాడువ్యసనము నానాట వృద్ధియగుచున్నది. కాని తగ్గుటలేదు. ఇచ్చట వీరికి సుబోధచేసి చూచెదగాక. (అని సమీాపించి) నాయనలారా! మీారు గౌరవనీయులు, సంపన్నగృహస్థులు. అట్టిచో యిట్టి త్రాగుడు త్రాగుట మందిపనికాదు. త్రాగకండి బాబూ.

తే. గీ. కల్లుసారాయి బ్రాందిని కైపుచేయు
త్రాగినంతట మత్తుచే జోగితూలి
రోడ్లమీాదను దొర్లుచు రోదనంబు
చేయుటయె కాని లాభంబు చెప్పమన్న.

తే. గీ. త్రాగినంతట నింకను త్రాగవలయు
నంచుకోర్కెలు జనియించు నందుచేత
మరల త్రాగును ప్రీతిచే మరచిమేను
దాన ప్రాణంబుపోవుట దప్పదయ్యె.

తే. గీ. త్రాగినంతనె ప్రేలుట తప్పదెపుడు
మాటతడబడు చెప్పుచో మరల మరల
అట్టి త్రాగుడు తగునయ్య యమరులంత
వారలైనను చెడుదురు నారయంగ.

తే. గీ. నోరువాసన వేయుచు చేరునంత
భార్య కోపించి వానిని బాధచేయు
స్నేహితులు చేరర తనితో ఛీ! యటంచు
పాడు త్రాగుడు త్రాగంగ ఫలముగలదె.

తే. గీ. త్రాగికక్కుచోనుండు నే దగ్గరగను
మనుజు డెవడైన వానితో మాటలాడ
భార్యయైనను జేరదా భర్తవద్ద
సిగ్గుచేటగు వానికి సిరులు దొలగు.

కావున నామాటలాలించి యిట్టి దురభ్యాసమైన త్రాగుడును మానుడు.

గోవిందరాజు—(కోపముతో) ఎవడవురా నీవు? త్రాగరాదని యుపన్యసించుచున్నావు. నీ మాత్రము జ్ఞానము మాకు లేదనుకొన్నావా? వచ్చిన దారి నేగుము.

కామేశ్వరరావు—(తూలుతూ మాటలు తూలిపోతూ) గో—గోవింద రాజుగారూ! మీ మీ రూరకుండుడు. నేను— కను కొంటాను. (అని అప్పారెడ్డి దగ్గరకువచ్చి) వచ్చినదారిని పోతావా? పోవా? (అని చెంపకాయ కొట్టును) నీ ధర్మోపన్యాసమునకు బహు మతి ముట్టినదా? లేదా? (అందరు నవ్వుదురు)

అప్పారెడ్డి—(శాంతముతో) నాయనా! నన్ను కొట్టిన విచారము లేదు. కాని యికనైన యీపాడుత్రాగుడు మానండి.

గోపాలం—(వెకిలి నవ్వు నవ్వుతూ) మేము త్రాగేదానిని నీవు కూడా కొంచం పుచ్చుకో. అప్పుడు దీని మహిమ నీకూ తెలుస్తుంది.

అప్పారెడ్డి—తాచెడ్డకోతి వనమెల్ల చెరచెనన్నట్లు మీరు త్రాగుటయే కాక నన్నుకూడ త్రాగమని దుర్బోధ చేయుచున్నారా?

గోవిందరాజు—మాదిదుర్బోధ, నీదిసుబోధ గావలయును (అని యొకబాగ్రింది సీసా అప్పారెడ్డి మీదకు విసరును. అది తగిలి రక్తముకారి సొమ్మసిల్లి పడిపోవును)

రమణారావు—వీడు దెబ్బకి చచ్చినట్లున్నాడు. ఇక్కడ వుండిన ప్రమాదంరండి పోదాం.

(అందరు తలొకదారికి చెదరిపోవుదురు)

అప్పారెడ్డి—(కొంత సేపటికి లేచి) అబ్బా యెంత దెబ్బ తగిలినది. రోగికి పథ్యాహారమువలె నా సద్బోధ వీరికి నచ్చలేదు. కాని యింతటితో విడువక మరల మరల బోధించెదగాక. (అని నిష్క్రమించును)

తెరవ్రాలును.

# ఎనిమిదవరంగము

---

(పెంటయ్య మరికొందరు చాకళ్లు ఎల్లి మొదలైనవా
రుండగా తెరలేచును)

పెంటయ్య— ఎల్లీ నిన్ను కులంలో కలుపుకోడానికి కులంవాళ్ళంతా ఒప్పుకున్నారు. నీమొగుడు కూడా నిన్నేలుకుంటా నన్నాడు. నీయదృష్టం బాగుంది. మరినేనుచెప్పినట్టన్నీ యేర్పాటు చేసేవా?

ఎల్లి— మామయ్యా చేసేను.

పెంటయ్య— ఏమేమి తెచ్చేనంటావు.

ఎల్లి— మామయ్యా! యిరవై కడవల కల్లు, రెండువందల డాముల సారాయి, ఇరవై కోళ్లు, మాంసపు పకోడీలు, కైమా చీకులు, రొట్టి శార్వ, మషాళావడలు, గారెలు, కార్జముకూర, పీతల కూర, నల్లకూర తయారు చేయించాను.

పెంటయ్య— అయితే యింక ఆలస్య మెందుకు? జగన్మోహిని అమృతాన్ని పోసినట్టు ఒక్కొక్కళ్ళకు పోసుకురా! చూస్తావెందుకు.

ఎల్లి— అల్లాగే మామయ్యా! (అని అందరకు అందించును వారెల్ల త్రాగుచుందురు)

(అంతట అప్పారెడ్డి ప్రవేశము)

అప్పారెడ్డి— (తనలో) తక్కువజాతివారిలో కులతప్పులను విధించి, తద్ధనముతో త్రాగుచుండుట, గొప్పతప్పు. కులతప్పులు విధించిన ధనముతో త్రాగుటమాని, ధర్మకార్యము లేవైన చేయు

కూడదా? యీత్రాగు డేల? అదిగో! అచ్చట చాకలివాండ్రు తాగుచున్నారు. వారితో ముచ్చటించి త్రాగుడు మాన్పింప యత్నించెద. (అని పరిక్రమించి ప్రకాశముగా) నాయనలారా! కల్లుత్రాగుట కడు నీచమయిన పని. అట్టి నీచమైన పని మీరేలచేయజూచెదరు. త్రాగిన మీకు గలిగెడు లాభమేమి?

పెంటయ్య— (తక్కువ చాకళ్ళతో) ఈయ నెవరో చాలా బుద్ధిమంతుడులాగ మాట్లాడు తున్నాడు. తగిన జవాబు నేను చెబుతాను. మీరూరుకోండిరా! (అని తాను ముందునకువచ్చి) బాబూ తమ రెవరు. ఈచాకలిగూడెంలోకి వచ్చి త్రాగకూడదంటున్నారేమి. త్రాగితే లాభంయేమిటో చెప్పమంటారా! పగలస్త మానం కష్టపడి పనిచేసే మాలాంటోళ్లు సందాల కాంత పుచ్చుకొంటే వంట్లో నొప్పులుతీసి, పొద్దుటికి చులాగ్గా మంచాలమీంచి లేత్తాం. లేకుంటే తక్కువ పేనుల్లాగ అలాగే తొంగోవలసి వస్తుంది. అంచేత కొంచం కల్లునీళ్లు పుచ్చుకొంటాం. యిందులో తప్పేముంది బాబు?.

అప్పారెడ్డి—మత్తుపదార్థములను సేవించుట తప్పు. కల్లు సారాయి, త్రాగుటవలన ధననష్టమగును.

పెంటయ్య—బాబూ! మాలాంటోళ్ళని తాగగూడదని చెప్పుతున్నారుగదా! దేవతలెందుకు తాగుతున్నారు?

అప్పారెడ్డి—పెంటయ్యా!

తే. గీ. దేవతలు త్రాగినారటంచు దేవులాడ
యమృతమును దానిమహిమంబు నధికమంచు
నందుచేతనె వారలు నధికులైరి
యనుచు చెప్పెదు త్రాగుట యనుచితంబు.

పెంటయ్య—బాబూ! మాలాంటోళ్ళము త్రాగడం తప్పేకాని గొప్ప గొప్పోళ్ళంతా బ్రాందీసీసాలు త్రాగేసి కాళీచేస్తున్నారు. అవేంటిబాబూ వానిపేరు కబ్బులా? అందులోకి గాప్పోళ్ళు మెల్లి యేంచేస్తున్నారు. రైలుస్టేషనుకాడ రిపరేషుమెంటురూములు ఉంటాయంట. అక్కడ రైలు ఆగ్గానే గొప్పోరు తేంచేత్తారు. అరుత్రాగేది త్రాగుడుకాదు. కల్లుత్రాగితేనే త్రాగుడా?

అప్పారెడ్డి—యెవరుత్రాగినను త్రాగుడేయగును. గొప్పవారు చిన్నవారు యనునిమిత్తములేదు. ఇది యొక గొప్పవ్యసనము. అందుచేతనే కాంగ్రెస్‌వారు మద్యపాన నిషేధమును గూర్చి విపులముగా నాలోచించి త్రాగుడణగద్రొక్కవలెనని ప్రయత్నించుచున్నారు.

పెంటయ్య—ఔనుబాబూ? ఔను కాంగ్రెసువారు చేసే యీప్రచారము చాలాగొప్పదే. ఎందుచేత నంటే? దిగుదిగుమనే చయితేగాని దిగేచయితి లేదని ఓ ముతకసామెతుంది. అలాగా త్రాగొద్దు త్రాగొద్దనిచెప్పే కాంగ్రెసువారిలో ఎంతమందిని త్రాగేవాళ్ళని చూపించుమంటారు. చాకలితొట్టనలంత సురాభాండాన్ని అవలీలగానెత్తి ఒకగుక్కలో, ఒకచుక్కైనా మిగలకుండా త్రాగేసే వాళ్ళని నేను బాగా యెరుగుదును. యెందుకు గాని అళ్ళపేర్లు చెప్పమంటారా? అగస్త్యలోకముసముద్రములో నీరంతా ఓగుక్కలో త్రాగినట్టు గడగడా పీల్చేసే ప్రముఖులున్నారు బాబూ?

అప్పారెడ్డి—నీవు చెప్పినదంతయు నిజము. గొప్పవారు త్రాగుచున్నారని త్రాగుట మంచి దంటావా?

పెంటయ్య—మంచిది కాకపోతే గొప్పోరంతా యెందుకు తాగుతున్నారు? మద్యపాన నిషేధచట్టము పెట్టాలని కాంగ్రెసు వారనుకుంటున్నా రన్నారుగదా? బీదోళ్ళని బాధించడానికా?

చట్టం పెట్టకపోతే జాతోడి దేశాన్నుంచి సముద్రాలు దాటిపోగా ఓడలమీద వచ్చే సామాన్ని దిగనీయకుండా, చట్టాలు పెట్టకూడదు బాబూ? అలాంటి చట్టాలు పెడితే గొప్పోరినోరు చప్పబడిపోతాది గాబోసు. గాంధిగారు సెప్పినట్టు మేము వాడేది సదేసీసరకు. గాంధి గారి మాటవినే వాళ్లంమేమా? లేకపోతే కాంగ్రెసు వారమని చెప్పి ఇదేసీసరకు వాడేవాళ్ళా? ఈ మాటొక్కటి సెప్పండి బాబూ?...

అప్పారెడ్డి—అయితే పెంటయ్యా త్రాగడం నష్టమేమీ లేదనా నీ వూహ. త్రాగడం వల్ల కలిగే గుణాలు ఎరుగవా?

పెంటయ్య—ఎరుగుదునో. ఎరుగనో! ఆ మాటెందుకండి మీరు చెప్పేది చెప్పండి.

అప్పారెడ్డి—అట్లయిన వినుము. త్రాగుడువలన అనేకనష్టములుకలవు. ధనవ్యయమొకటి, ఇక త్రాగునపుడు.

తే. గీ. ఒకటి డ్రాముడు త్రాగిన శుకమురీతి
పల్కులను బల్కు దియ్యగా బలుదెరంగు
ప్రీతిద్రాగిన రెండును పికమువోలె
బాటలను బాడుచుండును బాగుగాను.

తే. గీ. బాగుగా మూడునైనచో బకమురీతి
కునికిపాట్లను బడుచుండు కూరుచుండి
కోరి నాలుగు త్రాగిన కోతివలెను
గంతులిడుచుండు నిటునటు కలగి మనసు.

తే. గీ. అయిదు డ్రాములు త్రాగిన యకట రావ
ణుని యటువలెదా నారీమ ణులగోరు
ఆరు డ్రాములు ద్రాగిన యట్టివాడు
కర్ణునిం బలెదానంబు కరుణజేయు.

తే. గీ. యేడుడ్రాములు త్రాగిన యేడ్పి యేడ్చి
కుంభ కర్ణునివలె నిద్ర కోరుచుండు
ఎనిమిదియునైన డ్రాములు యినసుమంతు
రమ్మ రమ్మంచు బిలచును రాగ మొప్ప.

పెంటయ్య—(పకపక నవ్వుతూ) బాబూ యీసంగతులన్నీ యెప్పుడు కనిపెట్టేవు. నీకు కూడా యేమన్నా అబ్యాసముందా యేంటి?

అప్పారెడ్డి—(చిఱునవ్వుతో) త్రాగితేనేగాని యిటువంటి సంగతులు తెలియవంటావా? త్రాగేవాళ్లను చూచి తెలిసికో వచ్చునుగదా?

పెంటయ్య—చిత్తం, చిత్తంబాబూ!

అప్పారెడ్డి—పెంటయ్యా నీమాటలధోరణి చూస్తే, అన్నీ తెలిసినవాడవిలాగ కనిపించుచున్నావు యీత్రాగుడు పార్టీ ఎందుక్కు పెట్టించావు?

పెంటయ్య—ఆడోళ్ళని చూచి, అడవిదున్నల్లాగ తిరిగేబుద్ది లేనోళ్ళకి బుద్దివచ్చేటట్టుచేసి యభిచారం మానిపించడానికి కులతప్పెశామనేవంకని జురుమానావేసి, డబ్బుపుచ్చుకొని తాగేత్తున్నామండి.

అప్పారెడ్డి—మీకులతప్పులనే వంకలు బాగుగానే యున్నాయి. కాని, ఆడబ్బుతో త్రాగడంమంచిదికాదు.

పెంటయ్య—బాబూ! మరాడబ్బు యేంచేసుమంటారు?

అప్పారెడ్డి—అదే చెప్పుచున్నాను. ఆడబ్బుతో త్రాగుటకంటె తినతిండిలేక మలమల మాడుచున్న వారికి తిండిపెట్టుట

మంచిది. అంగహీనుల పోషించుటమంచిది. ఇన్నిటికంటె జీవదయా మండలియని నొకసంస్థ బయలుదేరి,నది నోరులేని జీవజంతువులను బలులిచ్చుట మొదలగు పనులను చేయువారిని ప్రబోధించి జీవహింసచేయకుండ నరుడు యేర్పాటులను చేయుచున్నారు. అట్టి సంఘములకు ధనసహాయము చేయుట మంచిది. ఏమందువు.

పెంటయ్య—బాగానే యుందండి, మీారుచెప్పేది.

అప్పారెడ్డి—చిన్న చిన్న తగవులు తీర్చుటని పెద్దకాపులవద్దకు వెళ్ళి నపుడు నేరమువిచారించి జురమానాలువిధించి ధనము ప్రోగుచేయుచున్నారే? ఆధనమునుగూడ జీవదయా మండలికిచ్చుట మంచిది.

పెంటయ్య—చిత్తం చిత్తం బాబయ్యా! ఇకముందు తమరు శలవిచ్చి నట్లు నడచుకొంటాము. మనమాటల సందడిని చాల పొద్దుపోయింది తమరింక దయచేయండి.

అప్పారెడ్డి—పెంటయ్యా నేను చెప్పినసంగతులు మరచిపోవుగదా.

పెంటయ్య—చిత్తంబాబయ్యా.

అప్పారెడ్డి—అట్లయిన నాకు పరమానందంకలిగింది. ఇక నేను వెళ్ళి వచ్చెద. (అని నిష్క్రమించును.)

తెరవ్రాలును.

---

# తొమ్మిదవ రంగము.

---

(ఇంటివద్ద సుందరమ్మ విచారముతో నుండగా తెరలేచును).

సుందరమ్మ— (విచారముతో)

సీ. ఔషధప్రాయమేయనుచు బ్రాందినిత్రాగ
మొదలిడనయ్యది ముదిరిహెచ్చె
సీసాలకొలదిని సేవించి హితులతో
పార్టీలుచేయుట పట్టుబడియె
నింటగలధనము యెంతయో వెచ్చించి
పాడుచేయుచునుండె పాడివచ్చి
నాఫీసునకువేళ యతిక్రమించకనేగి
పనులెల్లచేయగ మనసుపడదు

తే. గీ. యెక్కడో త్రాగి తూలుచు నిల్లుజేరి
పిచ్చిధోరణి సోదెల ప్రేలిప్రేలి
లేనినేరములెంచి బిరానవచ్చి
కొట్టి దుర్భాషలాడుకు కోపముబ్బి.

సకలైశ్వర్యములతో తులతూగు మా సంసార మావారు త్రాగుడింట ప్రవేశించినదిలగాయితు క్రమేణా దరిద్రదేవతానిలయ మగుచున్నది. ఇదివరకిక్కడ జూచిన సమస్త పదార్థములతో కనిపించు నిల్లు యిప్పుడవిపోయి, కల్లు, సారా, బ్రాందీ, మొదలగు వస్తువుల తోడను, కోడిమాంసపు చీకులతోడను నిండిపోవుచున్నది. తండ్రి

త్రాగుటచే తద్దోషమంటువ్యాధివలె కుమారునకుగూడ సోకి, మొదట చాటు చాటున త్రాగుట ప్రారంభించి, యిపుడు విచ్చలవిడిగ త్రాగుచున్నాడు. సుగుణము లలవడుట కష్టముగాని, చెడ్డగుణము లలవడుట కాశ్చర్య మేముండును. శారద నాతో రహస్యముగ నీసంగ తనేక మారులు చెప్పుచు వచ్చినది. (ముందునకుజూచి) అదిగో! మన్నాథుడాఫీసునుంచి వచ్చుచున్నాడు. ఏమిచెపుమా తూలుచు వచ్చుచున్నారు. ఈపూట మద్యపానసేవ మార్గమధ్యమందే కావించినట్లు తోచుచున్నది.

(గోవిందరాజు తూలుచు ప్రవేశించును)

గోవిందరాజు— (మాటలు తొట్రుపడుచు) ఓ! పెండ్లాం! సుందరమ్మా! గుడ్‌మార్నింగు, ఏమిచేస్తున్నావు. ఇంటికి రాగానే నీకొక సంతోషవార్త చెప్పి నీకొక షేక్‌హేండ్ యిచ్చి నీచేత ముద్దులు పెట్టించుకోందామని సంతోషముగా వస్తాఉంటే నీవీపూట విచారిస్తున్నట్టు నాకండ్లకు కనిపించి, నాసంతోషము అంతా పాడుచేశావు, ఏమిటి సంగతి.

సుందరమ్మ—(సంతోషము నటించుచు) వలదు. వలదని చెప్పుచున్నను వినక త్రాగుచున్నారు గదా? ఆఫీసునుండీ వచ్చుచున్నపుడు మార్గమధ్యమునందే త్రాగి వచ్చితిరి గదా? ఏమిటా సంతోషవార్త?

గోవిందరాజు—(తూలుపోయే మాటలతో వెకిలి నవ్వుతో) సంతోషవార్త వినడాని కిప్పటికి నీ మనస్సొప్పుతుంది గదా? విను, భార్యామణీ! నేను త్రాగుడులో బహుసమర్థుడనని ఆఫీసులో తెలిసికొని "ఆఫీసుకొచ్చి పనిచేస్తూంటే మీాకు త్రాగడానికి

తీరుబడిఉండదు. కనుక యీరోజునుండి యింటిదగ్గఱ కూర్చుండి బాగా త్రాగమని" ఆర్డరిచ్చారు. ఆదిసంతోషవార్త తెలిసిందా?

సుందరమ్మ—(ఆశ్చర్యముతో) త్రాగడానికి తీరుబడిలేదని కొన్నాళ్ళు శలవు పెట్టారా?

గోవిందరాజు—నేను శలవు పెట్టలేదు.

సుందరమ్మ—అంటే యేమిటో నా కర్థ మవలేదు.

గోవిందరాజు—ఆడదానికాఫీసు సంగతులే మర్థమివుతాయి. చెపుతాను విను. అంటే. ఉద్యోగము నీవు చెయ్యవద్దన్నారు.

సుందరమ్మ—(అనుమానముతో) ఉద్యోగమునుండి తీసివేసారా?

గోవిందరాజు—(తూలుతూ) అన్నమాట.

సుందరమ్మ—(గుండె బాదుకొనుచు) అయ్యో! అయ్యో! ఎంతపని జరిగినది.

చ. తగదని యెంత చెప్పినను త్రాగుడు మానకయుంటవల్ల యీ
జగతిని పేరు కీర్తులును జల్లగ జారుచుపోయె మీకు వీ
డగణిత త్రాగుబోతనుచు హాస్యముచేయ గవీలుగల్గె నీ
మగనికి బుద్ధిలేదనుచు మర్మములేకయె దెప్పిరంగనల్.

మ. తుదకాత్రాగుడె కొంపతీసె నిపుడుద్యోగంబు పోగొట్టెనే
మొదటే చెప్పితి త్రాగరాదనుచు నీమూలంబు వ్యాపించుటన్
నది పుత్రిందును నేర్చి త్రాగెడునునీయన్యాయమార్గంబు వి
డ్వదు పూర్ణాహుతిచేయకుండమనలన్ వాల్లభ్యమున్ జూపుచున్

గోవిందరాజు—(సంతోషముతో) దుఃఖించుచున్నావా? ఉద్యోగము పోయినందుకు మాబాగా పోయిందికాదు.

యానాటు స్వేచ్ఛగా యిష్టము వచ్చినట్టు త్రాగొచ్చును. అస్తమానూ డ్రింకింగు పార్టీలు చేయడానికి వీలౌతుంది. ఒకని లెక్కచేయనక్కరలేదు. తెలిసిందా?

సుందరమ్మ—(విచారముతో) ఏమి మీ యానందము. ఉద్యోగము పోయినందుకు సంతోషిస్తారా?

గోవిందరాజు—ఇది చాల సంతోషించ వలసిన సమయం. కనుక రేపు ఫ్రెండ్సు నందరిని పిలిపించి డ్రింకింగుపార్టీ చేస్తా. నీవు కూడ ఆ పార్టీలో పాల్గొని కొంచెము పుచ్చుకో. దాని మజా నీకూ తెలుస్తుంది.

సుందరమ్మ—(విచారముతో) చాలా బాగుంది. మీ ధోరణి.

(శారద ప్రవేశము)

శారద—(విచారముతో) అత్తా! ఏమది? మామగారిని ఉద్యోగము నుండి తొలగించిరా?

సుందరమ్మ—(విచారముతో) కోడలా! శారదా! మామగారదే చెప్పుచు నుద్యోగము పోయినందులకు విచారములేక, బాగుగ త్రాగ వచ్చునని సంతోషింపుచున్నారు. మన కొంపలో త్రాగుడెప్పుడు ప్రవేశించినదో అప్పుడే. వినాశకాల మాసన్నమైనదని వేసనుకొంటిని.

శారద—అత్తా! మామగారొకరే త్రాగుచున్నారా? మీ అబ్బాయంతకంటె తండ్రిని మించి బ్రాందిని సేవించుచున్నారు. వలదనిన మానుటలేదు. ఏమి చేయుదును.

గోవిందరాజు—(ఆనందముతో) ఏమిటి! మా అబ్బాయి రామారావుకూడా త్రాగుచున్నాడా? భేష్ అల్లాంటివాడే

కొడుకై పుట్టాలి. తండ్రి యానందములో పాల్గొన్నవాడే పుత్ర రత్నము.

(అంతట రామారావు త్రాగి తూలుచు ప్రవేశించును)

రామారావు—మా నాన్నగార్ని ఉద్యోగములో నుంచి తప్పించి వేశారనివిన్నా. ఎంతమట్టుకు నిజమోకాని, మా బాగా తీసేశారు. ఒకరికింద నౌఖరీ చేయక్కరలేదు. హాయిగా స్వేచ్ఛగా కాలం గడపడానికి వీలుగా ఉంటుంది. పాడు నౌఖరీ ఎవరికి కావాలి.

సుందరమ్మ—(తనలో) ఓరా! ఇద్దరు త్రాగే వచ్చారు. ఇంటికి యుద్యోగము పోవడమే యానందముగా యుంది. వీరిని యిక సర్వేశ్వరు డేమిచేయ దలచుకున్నాడో అదే జరుగుతుంది. (భగవంతు నుద్దేశించి) ఓ సర్వేశ్వరా! దయామయా! మా యానందమును సంసారమును నేటి కిట్లు దుఃఖమయముగా నొనర్చితివా? ఇక ముందేమి చేయదలచితివి. (అని దుఃఖించుచు) యీ త్రాగుబోతు మాటలను వినలేకుండా యున్నాను. వీరి నెట్లయిన లోనికి గొనిపోయెదగాక. (ప్రకాశముగా) నాథా! భోజనముల వేళయైనది. లోనికి పోవుదమా?

గోవిందరాజు—ఓ అల్లాగే. నడువు.

సుందరమ్మ—అబ్బాయీ! నీవు కూడ లోనికి నడువు. కోపాలాపద్దన చేయుటకు నీవును తక్కువ.

(అందరు నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

---

# ప ద వ ర ం గ ము

---

(హరి యింటియందు కూర్చుండి, ఆలోచించుచుండును.)

(తె ర లే చు ను.)

హరి— (తనలో) ఈవేళ "వేణు త్వరగా వస్తాను, నేను వచ్చేవరకు యెక్కడకు వెళ్ళకు"మని చెప్పి యింతదనుక రాలే దేమి చెపుమా!

(వేణు ప్రవేశించును)

హరి— (ముందునకుఁజూచి) అదిగో వేణు వస్తున్నాడు. (వేణుని చూచి) వేణూ! యింతాలస్యము చేశావేమి? పెందరాళే వస్తా వనుకొన్నాను.

వేణు—యేమిపెందరాళే రావడమోయి హరీ. ఆర్థికదుస్థితి యేమీ బాగాలేదు. యింటియొద్ద తండులాని నసంతి. అవి లేకపోతే గిన్నె పొయ్యెక్కదుగా, అందుచేత ఆలస్యమయింది. ఒక చోట ఒకరూపాయి ఊడబొడిచి బియ్యంతెచ్చి యిచ్చాక భోజనం అమిరింది.. అందుచేత పెందరాళే రాలేకపోయేను. యీసంసారబాధ తగ్గడాని కేదైన యుపాయం చెపుదూ?.

హరి— "రోలువెళ్ళి మద్దెలతో చెప్పుకుందట" అల్లాగ ఉంది నీవన్నమాట. ఇంటిదగ్గఱ నాపని అల్లాగే ఉంది. "లోపల లొటారం బయట బటారం" అన్నట్టు యీవేళకు యెల్లాగో లాగు గడిపేశావన్నావు. ఈరోజున భుక్తిలేక ఒక అరకప్పు కాఫీత్రాగి

కాలం గడుపుతున్నాను నేను. ఇంటిలో పెళ్ళాం పిల్లలు తిండిలేక పస్తు పడుకున్నారు. ఈరాత్రికైనా పట్టెడన్నము దొరుకుతుందా? లేదా? అనిపిస్తుంది. దేవుఁడు రెండు కళ్లు తెరచి మనవైపు చూడ్డం లేదు. యేమిచెయ్యమంటావు.

వేణు— ఈ తప్పంతా దేవుడిదంటావా? మనదే అంటావా? చిన్నతనంలో పెద్దలు చెప్పినమాటలువిని చదువుకోన కల్లరి చేస్తూ తిరిగి, పెద్దవాళ్ళ మయాక పెద్దలు గడించి యిచ్చిన యాస్తి నంతా, సానివాడకని, సారాతిత్తులకని జూదానికని విచ్చలవిడివెచ్చించిన మనకు తినతిండి యెల్లా ఉంటుంది? భగవంతునిది తప్పని నిందిస్తే మాత్రం లాభమేముంటుంది.

హరి— ఈవేదాంతము బోధిస్తావనే నిన్ను రమ్మన్నాననుకొన్నావా? "గతజల సేతుబంధనము" విడిచిపెట్టు. ముందుగతికి ఆలోచన చెప్పు.

వేణు— నాకేమీ యాలోచన బోధపడడము లేదు. నీవేమో బుద్ధికి బృహస్పతి యంతటివాడవు. కనుక నీవే చెప్ప సమర్థుడవు.

హరి— అల్లాగ దారికిరా. నేనొకసంగతి చెపుతాను విను. మన దారిద్ర్యము పోవడానికి ఒకమార్గంవుంది.

వేణు— చెప్పు చెప్పు. యింతకన్నా వుండామరి. సూతమహాఋషి మునీశ్వరులకు చెప్పినట్లు, శుకుడు పరీక్షితునకు చెప్పినట్లు, వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినట్లు చెప్పు. వింటాను.

హరి— మనదరిద్రము పోవాలంటే, ధనంకావాలి. ధనమే పురుషార్థ సాధనము కనుక అట్టిదానిని సంపాదించాలంటే పురుష

ప్రయత్న మవసరము. "కృషితోనాస్తి దుర్భిక్షం" అన్నారు కనుక ప్రతిదానికి ప్రయత్నము చేయాలి తెలిసిందా?

వేణు— నీవు చెప్పిన మాటలో విశేషార్థము కనిపించలేదు. ధనము సంపాదించడానికిప్పుడు మనము చేయవలసిన ప్రయత్నమేమిటో చెప్పు. చేటభారత మంతా విప్పుతావెందుకు. అసలు నీమనస్సులో యున్నదేమిటో ముఖ్యంగా మూడుముక్కలతో చెప్పు విసిగించక.

హరి—(పకపక నవ్వుతూ) అల్లాగ చెప్పేస్తే యేముందోయి అందం. పోనీ, నీమాటప్రకార మలాగే చెపుతానులే. గోవింద రాజుగారి కుమార్డు రామారావు ఉన్నాడు. ఎరుగుదువా?

వేణు— ఎఱుగకేమి? ఎఱుగుదును. అతడు మనము క్లాసుమేట్సుమే గదా? చిన్నతనములో స్నేహముగా ఉండేవాళ్ళము.

హరి— ఆత డిప్పుడు కొంచెము త్రాగుడు ప్రారంభించి డబ్బు ఖర్చు చేయుచున్నాడు. అతనితో పూర్వస్నేహం పాటించి త్రాగుడుతోబాటు వేశ్యాసంపర్కము కలిగించి, దానికి తోడు మూడుముక్క లాటలో దింపామంటే, యిక చెప్పవలసిందే ముంది. ఆపైనాలోచించుకో. కొంతకాలము మనకుకాలంగడుస్తుంది. ముందవి శకునిమామ యెత్తులు. జయంమనది. ఏమంటావు.

వేణు— నీయాలోచన యద్భుతముగాయుంది. కాని రామారావున కిష్టమే పావిని చూచావేమిటి.

హరి— అదీకూడ నేనే చెప్పాలా? నీబుద్ధంత మందగించి పోతుందేమి? మనవూళ్లో సరసీరుహమనే వేశ్యలేదటోయి.

వేణు— ఓరి నీదుంపతెగ. యెంతమంచి యాలోచన చేశావు. మన పాచిక పారితే కొంతదరిద్రము తీరుతుంది. యిందుకు యెప్పటినుండి ప్రయత్నం చేద్దాం.

హరి—ఎప్పటినుండో యేమిటి. నేటినుండే ప్రారంభము. రా.
పోదాము. రామారావు యింటికి.

వేణు— మంచిది, పద.

(అని యిరువురు వెడలుదురు)

తె ర వ్రా లు ను

---

# ప ద కొం డ వ రం గ ము

---

[రామారావు యింటియొద్ద విశ్రాంతిగా కూర్చుండి
బ్రాంది సీసాను తీసి]

రామారావు—ఓన్లీ వన్ కప్ బ్రాందిని సేవించకపోతే అదేమిటో
గాని యేమీా తోచదు.

ఉ. చల్లనిబ్రాంది త్రాగకయె శాంతము పొందదు మానసంబువే
తల్లడమంది చిత్తమును త్రాగుము త్రాగుమటంచు చెప్పెడున్
నుల్లము త్రాగకోరికల నుయ్యాల లూరెడు నెల్లవేళనే
డెల్లి నశించు దేహమున కింతటి బ్రాందిని బోయకుండునే.

(అని బ్రాందిని గ్లాసులోబోసి త్రాగి)

ఇప్పటికి ఓన్లీ వన్‌కప్, ఒక టీపాత్ర అయింది. మరొకటైతేనే
గాని పోర్సండుకోదు. (అని బ్రాందిని మరల త్రాగి) ఇప్పటి కొక
మా స్తరుగా ఉంది నిషా. ప్రతివాడు యిదినాయిల్లు. యాదినాభార్య

యని ముణిసిపోతాడు. తనశక్తిచేత గడియించానని గర్విస్తాడేగాని. యీవిషయాలు మాత్ర మాలోచించడు. అవి యేమిటంటే (కొంచెము తూలుతూ)

తే. గీ. దేవుడే సృజియించె నీ దివ్యమైన
సృష్టినంతయు మనుజుడా సృష్టియందు
నేను గడియించితీ డబ్బు నేర్పుచేత
నంచు గర్వించు నతనితో నరుగ డెపుడు.

తే. గీ. పొట్టనిండుగ త్రాగకే పోగుజేయ
దాచు కష్టంబె కాని యీ ధనముగూడ
కొంచుపోవు నే మనుజుండు కూర్మిచేత
మృతియు జెందిన పిదపను మిత్రితోడ.

తే. గీ. బ్రతికియున్నంతకాలంబు భ్రమలులేక
సౌఖ్యజీవిగ తానుండ సకల శుభము
జన్మమెత్తిన జీవి తా జచ్చుగాని
శాశ్వతంబుగ బ్రతుకునే సౌఖ్యముగను.

కనుక బ్రతికియున్నందుకు కడుపునిండా త్రాగకపోతే వాడు మనుష్యశబ్దవాచ్యుడు కాజాలడు. యిటిపంటి వేదాంతము యెవరైనా నేర్చుకోవాలంటే నా దగ్గఱ శిష్యరికం చెయ్యాలి. లేకపోతే బ్రహ్మవిద్య పట్టుపడదు. (కొంచెముతాళి) నామిత్రుండ్లు వేణు, హరి, యీరోజున వచ్చు వేళ దాటినది. వారితో స్నేహము చేయ మొదలిడినది. లగాయతు వారు కనిపించని రోజున కాల్గాలిన పిల్లివలె మది గంతులు వేయుచుండును. (ముందునకు చూచి) అదిగో! వేణు, హరి వస్తున్నారు.

(అంతట వేణు, హరి ప్రవేశింతురు)

రామారావు—వేణూ! హరీ! యీపూట యింత ఆలస్యము చేశా రేమి? పెందలకడనే వస్తారని, ఓస్లీ వన్‌కప్ బ్రాందిని సేవించి సిద్ధముగా యున్నాను.

వేణు—పెందలకడనే రావాలను కొన్నాము. కాని వీలు చిక్కినది కాదు.

హరి—ఇప్పుడు మాత్రం మించిపోయిన దేమున్నది?

రామారావు—ఔను. మీరుకూడా ఓస్లీ వన్ కప్పు బ్రాందిని త్రాగండి. అప్పుడు పేకాటాడడానికి హుషారుగా ఉంటుంది. (అని చెరియొక కప్పు బ్రాంది నిచ్చును) వారును బ్రాందిని త్రాగుదురు.

హరి—మేము త్రాగినప్పుడు నీవు కూడ త్రాగితేనే అందం ఉంటుంది.

రామారావు—అందుకు సందేహమా? నేనూ పుచ్చుకొంటాను. (అని త్రాగును) ఇక మనము చతుర్ముఖ పురాణము ప్రారంభిద్దాము.

(అని మూడు ముక్కల పేకాటాడ ప్రారంభింతురు)

హరి—మొదట పేక కలపడం నాది. నేను ముక్కలు పంచుతాను.

(అని పేక కలిపించును)

వేణు—నేను ఒకరూపాయి బ్లయిండ్ వేశాను. (అని ఒకరూపాయి వేయును.)

రామారావు—నేను వేశాను. బ్లయిండు (అని ఒక రూపాయి వేయును)

హరి—మీకంటె తీసిపోత నేనేనా? నేనూ వేస్తాను. ఒక రూపాయి (అని వేయును)

వేణు—(పేకచూచి) ఇదిగో! నే నీ మారయిదు రూపాయలు వేశాను. (అని ఒక నోటు పడవేయును)

రామారావు—నేను వేస్తున్నా నైదురూపాయలు (అని నోటు వేయును)

హరి—నాకాటలేదు. (అని తన ముక్కలు పడవేయును)

వేణు—ఈమారు పది రూపాయిలు (అని పదిరూపాయలనోటు పడవేయును)

రామారావు—నేను పది రూపాయిలు వేస్తున్నాను. (అని పది రూపాయల నోటు పడవేయును)

వేణు—మరల పదిరూపాయలు (అని వేయును)

రామారావు—నేను పదివేయు చున్నాను (అని వేయును)

వేణు—ఇదిగో! పదిరూపాయలు. యీమారు పేక చూపించుము. (అని పదిరూపాయలు వేయును)

రామారావు—(పేక చూపుచు) నాది ఆసురన్.

వేణు—నాది రాజులడంకా (అని పేక చూపి రూపాయలను తీసికొనును.

(అంతట అప్పారెడ్డి ప్రవేశము)

అప్పారెడ్డి—(తనలో) ఇచ్చట వీరు పేకాటాడుచున్నారు. వీరికి కొంతజ్ఞానోదయము చేసెదగాక. (సమీపించి, ప్రకాశముగా) నాయనలారా! మీరీ పేకాటేల యాడుచున్నారు. జూదము సప్తవ్యసనములలోను ఒకటి. దాని మహిమ చాలగలదు.

తే. గీ. తేనె జూదంబు పేకాట దీటిగలుగు
నాటలాడిన కొలదిని వాటముగను

మఱియుఁబోవును వాడుక మసలుచున్న
దీని నేర్చిన వారికి దెల్లమద్ది.

తే. గీ. తనకుగల ధనంబెల్ల దగులబెట్టి
భార్య మెడలోని బుస్తెయు బదిలముగను
ద్రెంపి నోడ్డెదు జూదరి దెగువజూడ
నెంతవర్ణింప నంతకు నెంతో మిగులు.

తే. గీ. ధర్మరాజును రాజ్యంబు దాయకోడి
భార్యనుం గూడ నోడ్డడే పాపమనక
జూదరికి మంచి చెడ్డలు మదినిగల్గు.
నయ్యె! యెట్టివారికినైన నట్టివేళ.

తే. గీ. నలుడు ధర్మజులోడిరి నలువయైన
జూదమాడిన నోడును వాదమేల
ముందు గెల్పించు, జూదము ముమ్మరముగ
వారికిని నాటలవేడుక వదలకుండు.

కావున నాపల్కులాలించి, ఈదుర్వ్యసనమును విడిచిపెట్టుడు.

రామారావు—(కోపముతో) వీడెవడో పేలుచున్నాడు. సంగతి కనుక్కోండి.

వేణు—నీ వెవ్వడవోయి? యిక్కడకు వచ్చి నీయిష్టము వచ్చినట్లు మాట్లాడుతున్నావు.

అప్పారెడ్డి—నేనొక ప్రచారకుడను.

హరి—ఓ ప్రచారకుడా! నీ యధిక ప్రసంగము కట్టిపెట్టి వచ్చిన దారిని బట్టుము. లేకున్న నీకు అర్ధచంద్రప్రయోగమగును పొమ్ము.

అప్పారెడ్డి—నాయనలారా! దేహాభిమానము విడచిన నాయట్టివానికి మీ మాటలతోడను, అర్ధచంద్ర ప్రయోగముల తోడను, నిమిత్తము లేదు. కాని, వెలది, జూదము, పానము, పలుకు దండము, పలుసుదనము, సొమ్మునిష్ప్రయోజనముగ వెచ్చించుట నివి వ్యసనములని బుధులు వక్కాణించిరి. కావున నట్టి వ్యసనమును విడిచిపెట్టుడు.

హరి—పొమ్మన్నా పోకుండా నున్నావే. (అని చెంపకాయ కొట్టును)

అప్పారెడ్డి—నాయనలారా! నన్ను కొట్టినను చింతలేదుకాని, మీరీ వ్యసనమును మానుడు.

రామారావు—ఓరీ ఫూల్. ఇంకా యిక్కడనుంచి పోవూ. (అని తూలుతూ వచ్చి అప్పారెడ్డిని గెంటివేయును) వీడుట మనకు బుద్ధులు చెప్పువాడట? మాబాగా అయింది. ప్రాయశ్చిత్తము (అందరు నవ్వుదురు)

వేణు—ఈవేళ కాటచాలించి లేద్దాము.

హరి—ఆటచాలించి వేయడానికేమిగాని, మనము ప్రతిదినము యిచ్చటకు వచ్చుచున్నాము. రామారావు మాత్రము మనయింటికి వచ్చుటలేదు. మనకు ప్రతిదిన మాతడు ఫలహారములు, డ్రింకు యిచ్చుచున్నాడు. మనము స్వీకరించుచున్నాము. వేణూ! యీ దినమున రామారావును మనయింటికి తీసికొని వెళ్ళవలెను. సుమా!

వేణు—రామారావు! హరి మాటలు విన్నావా? నేటి రాత్రి మే మిచ్చు నాతిథ్యమును నీవు స్వీకరించాలి ఏమంటావు?

రామారావు—మీ యాతిథ్యమును స్వీకరించడానికేమి? కాని, మా నాయనగారు పంక్తి భోజనమునకు నే నరుగకున్న భుజింపరు. క్షమింపుడు.

హరి——భోజనమునకు రాకున్న రాత్రి డ్రింకింగు పార్టీకైనను రావచ్చును గదా?

రామారావు——అట్లైన మన మందరము ఇచ్చటనే భుజించి పిమ్మట నెచ్చటికైన నేగ వచ్చును.

వేణు——ఇదియును బాగుగానే యున్నది. కనుక యిప్పటి కింటికేగి వచ్చుట మంచిది.

రామారావు——రాత్రి భోజనమునకు మాయింటికి రండు.

హరి——మంచిది. యిప్పటికిపోయి వచ్చెదము.

రామారావు——మంచిది పోయిరండు. (హరి, వేణు నిష్క్రమింతురు)

తెరవ్రాలును.

---

# ప న్నెం డ వ రం గ ము

---

(సరసీరుహాం ఇంటివద్ద నలంకరించుకొనుచు నిలువుటద్దమువద్ద యుండగా తెర లేచును)

సరసీరుహాం——(తనలో) "ఈపూట రామారావును తీసికొనివచ్చి నావలలో చిక్కేటట్లు చేస్తా" మని వేణు, హరి చెప్పి

వెళ్లేరు. వారు వచ్చేసరికి ముస్తాబు ముగించుకొని సిద్ధముగా నుండ వలెను. (వినుట నటించి) అదిగో! గుమ్మమువద్ద నుండిశబ్దము విని పించుచున్నది. వారు వచ్చుచున్నట్లున్నది. (తెరలో సరసీరుహాం! సరసీరుహాం! అని వినిపించును)

సరసీరుహాం—ఆ! వచ్చుచున్నాను. (తలుపు తీయుటనటించును)

(హరి, వేణు, రామారావు ప్రవేసింతురు)

సరసీరుహాం—(నమస్కరింపుచు ముసిముసి నగవులతో) అయ్యా! దయచేయుడు. యీయాసనములపై గూర్చుండుడు (అని కుర్చీలను చూపును. ముువ్వురు కూర్చుందురు)

రామారావు—(తనలో) హరి! తనయింటికి డ్రింకింగ్‌పార్టీకి రమ్మని పిలిచి నిన్నిక్కడకు తీసికొని వచ్చేదేమిచెప్మా. ఈమె వరసచూచిన సానివలె కనిపించుచున్నది. (ప్రకాశముగా) హరీ! ఈ యిల్లెవరిది? నీయింటికికదా నన్నాహ్వానము చేసితివి? ఈమెయెవరు? నీభార్యయా?

హరి—ఏమిటోయి రామారావు అల్లాగ కంగారు పడుతున్నావు. ఈయిల్లును ఈయింటిలోనివారును, నీ, నా, భేదము లేనివే.

రామారావు—అనగా నా కర్థము కాలేదు.

హరి—ఈయిల్లు సరసీరుహామనే వేశ్యది. ఈమెయే సరసీరుహాము.

రామారావు—మరి నన్నిటకేల గొని వచ్చితిరి?

హరి—సరసీరుహాముచేత నీ కొక డ్రింకింగ్‌పార్టీ యిప్పించుటకు కొని వచ్చితిమి. (సరసీరుహామువైపు చూచి కూని రాగాలతో)

పాట—ఓసరసీ! రుహానయనా! భూసురసుం దరవదనా
పాధనిపా పధపమగా రీగసరి గమగరిసా

అల్లాగచూస్తా నిలబడ్డా వేమి వచ్చినవారిని మర్యాద చేయక? ఓస్లీ వన్ కప్ డ్రింకును తీసికొనివచ్చి యిచ్చుకో ముందు. తరువాత కార్యక్రమం చూద్దాం.

సరసీరుహాం—చిత్తము (అని సీసాలోనిబ్రాంది గ్లాసులలో పోసి) అయ్యా! తమ రిది స్వీకరించుడు. (అని రామారావు నకు ముం దందించును)

రామారావు—(అందుకొని త్రాగును)

సరసీరుహాం—(హారికి, వేణునకు గూడా బ్రాందిగ్లాసుల నందించును)

హారి—(అందుకొని త్రాగును)

వేణు—(త్రాగుచూ) రామారావూ! ఈసరసీరుహాం అందం విషయ ములో నీయుద్దేశ్య మేమి?

రామారావు—వేణూ! ఈమె నిజముగా మోహినీదేవత యన వచ్చును. (యింతలో సరసీరుహాము మరియొకగ్లాసు నందింప త్రాగును)

సీ. మేఘమధ్యమునుండి మేదినిపై వ్రాలు
మెరపుతీగయనంగ మేనిచాయ?
చంద్రబింబముతోడ ఛాలంజి చాయగ
చాలుననెడి మోము చందమొప్పు?
పద్మపత్రంబుల పరిభవింపగజాలు
చారెడు గనుగవ చలువచూపు?
చాతకపక్షుల సరిబోలు వక్షువ
చనుదోయి బిగువున సరసమాడు?

ఆ. వె. మన్మథాస్త్ర తునగ మరులు గొలుపుచుండె
చూచునంత నార సుదతిహాయులు
లేదు భూమినిట్టి లేమ మరొక్కతె
ఏమి చెప్పవాడ యింతిసొగసు.

వేణు—రామారావుగా! అయితే ఈమెగీటుకు వచ్చిన పదునారవ వన్నె బంగారమే యన్నమాట.

రామారావు—అందుకు సందేహమా?

వేణు—సరసీరుహమువంక చూచి కన్నుగీటును) సరసీరుహాం! చూస్తూ యూరకున్నావేమి?

సరసీరుహం—(మరల నొకగ్లాసుతో బ్రాంది రామారావున కందించును)

రామారావు—(అందుకొని త్రాగుచు) పూర్వము మోహిని అమృతము నందిస్తే దేవతలు హాయిగా త్రాగేరన్నారు. ఆమాట నిజమే. సరసీరుహాం! నీచేతినుండి యందించిన బ్రాందీని త్రాగుచున్న నది యమృతతుల్యమైంది సుమా?

సరసీరుహం—అది తమవంటివారి యనుగ్రహముగాక వేరొండు గాదు. తమదర్శనముకొరకు చాలదినములనుండి వేచి యుంటిని. అద్యాది నేటికి లభించినది.

రామారావు—(త్రాగి మత్తతతో) మాదర్శనముకొరకే కనిపెట్టుకొనియుంటుట యెందులకు?

సరసీరుహం—తమయీవిషయు, నందమును విని యుండుటచేత,

ఉ. ఎన్నడు రామమోహనుని యీప్సిత మొప్పగ జూచుదాన నా
కెన్నడు దర్శనంబగును యింతకు దేవుని యిచ్చ యెట్టిదో

మన్నన బొందజాలుదునో మాన్యునిపాదము లంటి భక్తితో
సన్నుతి చేసి పూజలను సల్పెదుభాగ్యము గల్గనేర్చునే.

అని పరిపరివిధముల దలపోయుచుండును. నేటి కట్టి భాగ్య మబ్బినది. తమవంటి సరసులతో సరససల్లాపముల దేలవలయునని తలంపు గలిగియుండుటవలన మనోహరా! యీదీనురాలికోర్కె చేకొని యేలుకొనుడు.

రామారావు—(తూలుతూ) సరసీరుహం! నీకోరిక వ్యర్థపుచ్చే నిర్దయుడు కాడు యీరామారావు.

వేణు—రామారావూ! మన యింటి కేగుదమా?

రామారావు—వేణూ! యీసరసీరుహము నన్ను ప్రేమించియున్నది కావున నే నీ రాత్రిచ్చటనే శయనింతును. హరి, నీవు నేగుడు.

హరి—మంచిది. ఉదయముననే నిన్ను కలుసుకొందుము. పోయి వచ్చెదము. (అని వేణు హరి నిష్క్రమింతురు)

సరసీరుహం—(తనలో) రామారావును తీసికొనివచ్చెదము. ఎట్లైన నాతనిమనసు కరగించి ధనము లాగమని, హరి, వేణు చెప్పి యీతని నిచ్చటకు గొనివచ్చినారు. ఈతడు నామాటల కంగీకరించినాడు. పైగా త్రాగినమత్తతలో నున్నవాడు. పైకము లాగుట బహుసులువు.

రామారావు—సరసీరుహం! ఏమి టాలోచించుచున్నావు?

సరసీరుహం—ఏమియును లేదు. విందులతోడను వినోదముల తోడను, చాలా రాత్రి యైనది. శయనింతురా?

రామారావు—నీకోరిక యెల్లాగో అల్లాగే చేయవచ్చును.

సరసీరుహం—అటయిన రండాగదియందు శయనింపవచ్చును.
రామారావు—మంచిది పద (అని యిరువురు నిష్క్రమింతురు)

తెరవ్రాలును.

---

# ప ద మూ డ వ ర ం గ ము

---

(అమ్మవారి గుడియెదుట, ఆసాదివారు కత్తులు చేతబట్టి గొఱ్ఱెలను బలివేయుటకు సిద్ధముగా నుందురు. డప్పులు వాయించు చుందురు. తెరలేచును)

అప్పారెడ్డి—(ప్రవేశించి) నాయనలారా! ఆగుడాగుడు. యీజంతువులను బలివేయుట న్యాయము కాదు. నేటివరకు మనము పెంచిన నోరులేని యీయమాయకపుజంతువులను తలనరికి ప్రాణము తీయు టన్యాయము.

తే. గీ. జంతుబలి ధర్మకార్యమే! జంకవలదె?
క్రూరకృత్య మటంచు నోక్రూరకర్మ!
నెవ్వరైన నను నిను జంప నెంచునపుడు
యేడ్చున ట్లవి యేడ్వవా యేమి చెపుమ?

ఆసాది—ఎవ్వడవయ్యా! నీవు. అమ్మవారియుత్సవము చేసుకొంటుంటే యడ్డుతగులుతున్నావు.

అప్పారెడ్డి—నే నొకజీవదయామండలి ప్రచారకుడను. మీాయుత్స
వములకు నే నేమియు నడ్డుతగులుట లేదు. కాని,
జంతువులను ఖడించవలదని, ప్రార్థించుచున్నాడ. నాప్రార్థన మన్నించి
యీాజీవహింస మానుడు.

ఆసాది—ఏ టేట మే మీాలాగున నమ్మవారికి, జాతరలు, యుత్సవ
ములు, బలు లిచ్చుచుందుము. దీనికి తప్పేమి
యున్న ది.

అప్పారెడ్డి—ఏ టేట నమ్మవారికి చేయు నుత్సవములు, జాతరలు
చేయవల దనుటలేదు. జంతువులబలి దప్పేయగును.
ఏమందువా? నిండుప్రాణముతో నున్న జంతువులను చంపుట తప్పు.
"అహింసా పరమో ధర్మః" యని పురాణములు భగవద్గీత చెప్పు
చున్నవి.

ఆసాది—ఏమిటయ్యోయి! నీపురాణాలు, భగవద్గీతలు మాకు
మాత్రము తెలియ వనుకొన్నావా? "జీవికి జీవియే
జీవనాధారంబు" అని పురాణాలు చదివేదగ్గర కూర్చుని మేమూ
విన్నాము. పురాణాలు, నీమాత్రము మాకూ తెలుసును. ఇంకొక
సంగతి చెపుతాను వినండి. దానికి నిదర్శనంగా కప్ప యేంచేస్తుంది.
పురుగును పట్టుకొని మింగుతుంది. ఆకప్పను పాము మింగుతుంది.
పెద్దపులి యేమిచేస్తుంది? లేళ్ళని, దుప్పులను చంపి తింటుంది. సింహ
మేమిచేస్తుంది? ఏనుగును చంపి మెదడు తింటుంది. ఇల్లాగే యొక
జీవికి జీవనాధారము. తెలిసిందా. ఈజంతువులను చంపి తినకపోతే
పెరిగి ప్రపంచా న్నాక్రమించేస్తాయి. చేపలను పట్టుకొని తినకపోతే
మెండవేళ నీటిలో నుండలేక యవి యందులోనే చచ్చిపోయి క్రుళ్ళి
నీటిని పాడుచేస్తాయి. అందుకనే అల్లాంటివాటిని తినవచ్చునన్నారు
పెద్దలు.

అప్పారెడ్డి—నోరు జ్ఞానములేని జంతువు లాకలి యడంచుకొనుటకు క్షుద్రజంతువులను చంపి తినుచున్నదనుట నిజము. మనకు నోరును, జ్ఞానము కలిగి జీవహింస చేయుటతప్పు. జ్ఞానము, నోరు కలిగియుండుటం బట్టి మనము జంతువులకంటె గొప్పవారమగు దుము కదా? జంతువులవలె మనమును తప్పు పనులు చేసిన యిక మనయాధిక్యత యేమి కలదు? మనమును జంతువులతో సమానమగు దుము. జంతువులనుచంపి తినకున్న నవి పెరిగి భూమినాక్రమించు నం టివిగదా? తల్లికి పదిమంది సంతానము కలదనుకొనుము. సంతాన మధికమైనదని పదునొకండవ దానిని కనక మానునా? లేక కన్నపుత్రి లను తల్లి చంపివేయునా? చెప్పుము? ఆవిధముననే మిగిలిన జంతు వులునని తెలుంచుము. వాటికాయువు మూడినప్పు డవియే నశించును.

ఆసాది—అట్లైన ప్రతిసంవత్సరము చేయు నీ యుత్సవమును మాని వేయమందువా?

అప్పారెడ్డి—ఉత్సవములను మానివేయమని నేను చెప్పుటలేదు. బలి విధానము మాత్రము మానివేయుమని చెప్పుచుంటిని.

తే. గీ. కోళ్ళ, మేకల, గొఱ్ఱెల గొంతుకోసి
నమ్మవార్లకు నర్పింతు రదియు మేలె?
అమ్మవార్లకు శక్తితో యారగింపు
నితరమేలైన జేవికి యింపుగాదె.

అమ్మవారికేటేట నుత్సవములుచేయుచు జాతరులుచేయుచు, బూరెలతోడను, గారెలతోడను, వడపప్పుతోడను, పానకముతోడను నైవేద్యములుపెట్టుడు. అట్లు చేసిన నుభయతారకముగా యుండును.

ఆసాది—మాపిల్లలకు జబ్బుచేసినపు డమ్మవారికి జీవికి, జీవియిస్తామని మ్రొక్కుకున్నాము. అమ్మవారు మాయందు దయ

యుంచి మాపిల్లలను బ్రతికించింది. అల్లాటప్పుడు యీజంతుబలు లివ్వకపోతే మమ్ములను మాపిల్లలను బ్రతుకనిస్తుందా? అమ్మవారు.

అప్పారెడ్డి—ఇదియొక పిచ్చినమ్మకము. జబ్బుచేసిన పిల్లల కేమంచి వైద్యునో తీసికొనివచ్చి మందిప్పించిన రోగము కుదురును. కాని, అమ్మవారికి మ్రొక్కికొంటిమని మందు వేయకుండిన కుదురునా? గాలిలో దీపముపెట్టి, అమ్మవారూ! నీదే మహాత్మ్యము అన్న నది యారిపోక నిలచునా? యోచింపుడు.

ఆసాది—ఈకబుర్ల కేమిలేవయ్యా? ఎవరిమట్టుకు వారి కో స్తేనేగాని బోధపడదు. అమ్మవారికి కోపమువ స్తే బ్రతుక నిస్తుందా. నిన్ను అమ్మవారిని దూషించినందుకు చంపలు వాయించుకొని దండంపెట్టి అవతలికిపో (డప్పులవాండ్రను జూచి) మానేశారే మర్ర? డప్పులు వాయించండి. (అని కత్తినెత్తును)

అప్పారెడ్డి—జయ్ పరమేశ్వరా! (అని గొఱ్ఱెతలమీద తనతలపెట్టి) ఆసాదీ! గొఱ్ఱె తలకంటె ముందు నాశిరస్సును ఖండింపుము.

ఆసాది—లే. లే. అవతలకెళ్లు. అదేమి టల్లాంటున్నావు?

అప్పారెడ్డి—ఆసాదీ! ముందు నాతల పిమ్మట గొఱ్ఱెతల ఖండింపుము. లేదా. ఇకముందెప్పుడు జీవహింస చేయనని ఘోర ప్రమాణము చేయుము. అట్లుచేసిన లేచెదను.

ఆసాది—(నిర్ఘాంతపడి చేతనున్న కత్తిని పారవైచి, అప్పారెడ్డి కాళ్లకు నమస్కరించుచు). అయ్యా! నే నింకెప్పుడు యిల్లాంటి జీవహింసలు చేయను. అమ్మవారితోడు. మీపాదాలతోడు. నన్ను క్షమించండి.

అప్పారెడ్డి—(సంతోషముతో) ఆసాదీ! నీవింక భగవంతునిచేత మన్నింపబడుదువు. నిన్నా సర్వేశ్వరుడైన జగద్రక్షకుడు కాపాడుగాక! పోయివచ్చెదను. ఇకముందు నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుము.

ఆసాది—చిత్తము బాబయ్యా!

(అప్పారెడ్డి నిష్క్రమించును)

తెరవాలును.

---

## పదునాలుగవరంగము

---

[ఇంటియొద్ద శారద యుండగా తెరలేచును]

శారద—(విచారముతో) అక్కటా! యీతాగుడు పిశాచము మా యింట ప్రవేశించినది లగాయితు యైశ్వర్యము తొలగి పోవుటయే గాక. తండ్రి కొడుకు లిరువురు తాగుచుండుటయును, దాన మా మామగారి యుద్యోగము పోవుట నివి కారణములుగా నత్తగారు మనోవ్యథచే మంచముబట్టి మరణించిరి. ఇక మామగారో వృద్ధులై యుండుట కతనను మొదటనేర్చిన త్రాగుడు దురభ్యాసము వదలక త్రాగుటకు డబ్బులేక శల్యావశిష్టులై యున్నారు. ఇక మన్నా

ధుఁడోయన త్రాగుడునకుతోడు. జూదము, వేశ్యా సంపర్కము నబ్బుటచే నింటగల ధనమును వెచ్చించి పూర్వార్జితపు భూముల నమ్మి స్వేచ్ఛగా కాలము గడపిరి. తుదకవియు చెల్లిపోవుటవలన నా నగలనుగూడ నమ్మివై చుటయే గాక మంగళసూత్రము గూడ విక్రయించిరి. నివసించు గృహముకూడ తనఖాయందున్నదని విని యుంటిని. అప్పులవాండ్రెప్పుడో యొకప్పుడు వచ్చి మమ్మాయింట నుండి వెడలగొట్టిన నిక మాపాట్లడుగవలెనా? తిన తిండియున్నను లేక యున్నను నింటిలోపడి యుంటిమి. ఇక యేచెట్టునీడను నివసింపవలసి వచ్చునో గదా?

ఆ. వె. తండ్రి త్రాగెననుచు తత్పుత్రుండును త్రాగ
మొదలుపెట్టి త్రాగిముంచె కొంప
నింటనుండు ధనము వింతులకును జూద
మునకు త్రాగుడునకు చనియె నకట!

ఓ ఆపద్బాంధవా! దీనజనాశరణ్యా ఇక నీకంటె మాకు వేరు దిక్కు లేరు. ప్రపంచమున నీసాడుత్రాగుడు ఏలపెట్టితివి. ఈ త్రాగుడు వలన ఎన్ని సంసారములు దిబ్బలయి తినతిండిలేక కట్టబట్టలేక యల్ల లాడుచున్నారో గదా! ఓ దేశబాంధవులారా! ఈ పాడుత్రాగుడు దురభ్యాసమును తగ్గింపుడు. ఇది వేరుపురుగువలె నెన్నికొంపలను నాశనము చేయుచున్నదో గమనింపుడు. (అని విచారించుచుండును)

(అంతట రామం, చిట్టితల్లి ప్రవేశింతురు)

చిట్టితల్లి—(శారద దగ్గరకువచ్చి) అమ్మా! అమ్మా! ఏడుస్తున్నావేమి?

శారద—అమ్మా! చిట్టితల్లీ! వచ్చితివా? (అని గాకలించుకొని ముద్దాడి) నే నేడ్వడము లేదమ్మా.

చిట్టితల్లి—ఏడ్వకపోతే కమలమండి నీరు వస్తుందేవి. నాన్నగారు ఇం
టికి రాలేదనా?

శారద—ఔనమ్మా! చిట్టితల్లీ!

రామం—అమ్మా! నాన్నగారు యెప్పుడు ఇంటివద్ద ఉండరేమమ్మా?

చిట్టితల్లి—ఉంటే లాభం ఏమిటి? అమ్మని కొట్టటానికా?

రామం—చిట్టితల్లీ! అందుకుకాదు, మా మాష్టరుగారు నాలుగవ
తరగతి పుస్తకము కొనుకొనమన్నారు. నాతో చదువు
కొను పిల్లలందరపుడే పుస్తకములను కొనుకొన్నారు. నే నింకను పుస్త
కములను కొనుక్కొనలేదు. నాన్నగారింటికి వచ్చినపుడు డబ్బులడ
గుట కట్లడిగితిని.

శారద—నాయనా! రామం! అట్లే పుస్తకములను కొనుక్కొందువు
గాని లెమ్ము.

రామం—అమ్మా నీవైనా డబ్బులీయమ్మా! పుస్తకములను కొను
క్కొంటాను.

చిట్టితల్లి—అన్నయ్యా! రామం అమ్మదగ్గర డబ్బు లెట్లా వచ్చేయను
కొన్నావు? అమ్మ నడుగుతున్నావు? నిన్న నాన్న
యమ్మనుకొట్టి, మెడలో యుంటాయి యవి పట్టుకుపోయేరు. అట్లాం
టప్పుడమ్మ నడుగుతావేమి?

రామం—అమ్మనీ యడుగక నాన్ననీ యడుగక పోతే మరి పుస్తక
ములు కొనుక్కొవడ మెట్లాగ? పుస్తకములు లేక
పోతే చదువెట్లాగ వస్తుంది?

శారద—(కన్నీరు కార్చుచు) దురదృష్టవంతురాలి కడుపున పుట్టిన
నీ కెట్లాగవచ్చాయి. డబ్బులునాయనా! ఏ యదృష్ట
వంతురాలు కడుపుననో బుట్టిన నీ కోరికలు దీఱునుగదా!

చిట్టితల్లి—చూసేవా! అన్నయ్యా! నీవు డబ్బులడిగినప్పు డియ్యలేక పోతేనని అమ్మ యేడుస్తుంది. నీకు చదువుకోవాలని యుంటే నాపుట్టినరోజున చేయించి మెడలో వేసిన బంగారపు గొలుసుంది. అది పట్టుకువెళ్ళి అమ్మివేసి పుస్తకములు కొనుక్కొని చదువుకో తెలిసిందా? (అని మెడలోని గొలుసునుతీసి రామమున కియ్యబోవును)

శారద—(చిట్టితల్లిని కౌగలించుకొని) అమ్మా! చిట్టితల్లీ! నీ కడుపులో నెంతంత యూహలున్నవమ్మా! (అని ముద్దాడును.)

రామం—అమ్మా! చెల్లెలినే ముద్దుపెట్టుకుంటున్నావు. నేను డబ్బులడిగేనని కోపమా? నన్ను ముద్దులు పెట్టుకొనడం లేదు.

శారద—(రామమును దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకుంటూ) కాదు నాయనా! కాదు. నీమీద కోపములేదు. నీవు శిశువువైనప్పుడు నిన్నెన్నిమారులు ముద్దుపెట్టుకొంటినో నీ కెరుగవు. ఇప్పుడు చిట్టితల్లి నీకంటె చిన్నది. కావున చిట్టితల్లిని ముద్దుపెట్టుకొంటున్నాను. అంతే తేడా. (తనలో)

ఉ. వచ్చియురాని మాటలను వాకొనిపుత్రులు తల్లిదండ్రులన్
నిచ్చలు సంతసంబునెడు నీరధి నీరెదునట్లు చేయుచున్
మచ్చికతోడనుండుటయె మాతకు నిండుముదంబు నిచ్చునా
ముచ్చట చిట్టితల్లియును ముద్దులరామము తీర్చునట్లుగాన్.

వ్యసనములకుచిక్కి యింటి పట్టున నుండకున్నను, చిట్టితల్లి, రామముల ముద్దుపల్కు లాలించు చుండుటవలన, కొంత కాలక్షేపమగుచున్నది. యీ యానందమైన లేకున్న నే (బ్రతుకగలనా? పుత్రి)

పుత్రుల జూచుకొని కొన్ని దినములకైన మరల మంచిరోజులు రాకుండునా! యనెడు యాశాపాశము నన్నావహించుటచే ధైర్యవంతముగా మనుచుంటిని. నా చిరంజీవులే నా యానందము.

రామం—(ముందునకు చూచి) అమ్మా! అమ్మా! నాన్నగారు వచ్చుచున్నారమ్మా!

చిట్టితల్లి—అమ్మా! అన్నయ్యమాట నిజమే. అదిగో నాన్నగారు. తూలుతూ వస్తున్నారు.

శారద—(ముందునకు చూచి) ఔను నిజమే. (లేచి నిలుచుండును)

(అంతట రామారావు తూలుతూ ప్రవేశము)

రామారావు—(తూలుతూ) విచారముగా నున్నట్లు కనుపించుచున్నావు? ఏమిటి సంగతి?

శారద—ఏ విచారమును లేదు. ఒక్కటే విచారము.

రామారావు—ఏమిటా ఒక్క విచారమును? నన్ను గురించా?

శారద—ఔను.

రామారావు—ఏల?

శారద—త్రాగుడు, జూదము, వెలది, నీవిమూడును వ్యసనముల లోనివి గదా? అట్టి యీ మూడుదుర్గుణములు మీ యందుండుట వలన మనసంసార మధోగతిపాలైనది గదా? అట్టిచో వ్యసనము నేల విడువరా? అని.

రామారావు—(జేబునుండి బ్రాందిసీసాను తీసి త్రాగుచు) భర్త దుర్మార్గుడైనా, సన్మార్గుడైనా భార్య యాతని భక్తితో పూజింపవలసినదని పతివ్రతాధర్మములు బోధించుచుండ నీవిట్లు నిందింప వచ్చునా?

కౌశికుడను బ్రాహ్మణుడు వేశ్యాసంగమ వాంఛతోనుండ, పతివ్రతా శిరోమణియైన యాతనిభార్య సుమతి గ్రహించి సాని

కూడిగములునల్పి యొప్పించి, భర్తను తనభుజములపై నెక్కించు కొని, వేశ్యవాడకు గొనిపోలేదా? ఆసంగతి మరచితివా? ఇదేనా పతి భక్తి?

శారద—ప్రాణేశ్వరా! మీ మాట నిజమే. ఔనౌను. మిమ్ము నేవ గించుకొనుటగాని, దూషించుటగాని లేదు. ప్రార్థన పూర్వకముగ విన్నవించు కొనుచున్నాను. ఇప్పటికే తినతిండి, కట్ట గుడ్డయు, నుండనీడయును లేకుండ పోవుస్థితికి వచ్చితిమి. ఇకనైన నావ్యసనములు విడిచిన బాగుపడవచ్చును. లేకున్న మనగతి యధో గతియే? భర్త యర్ధశరీరము భార్య కావున మీ యందుండు చనువు బలిమి నిట్లు అనుచున్నదాన మన్నింపుడు.

రామారావు—శారదా! నీవిట్లు నాచెవియొద్ద ఘోషించినదంతయు వ్యర్థము. ఏ మందువా?

తే. గీ. వ్యసనములకు జిక్కక యుండువాడె ధన్యు
డగును, జిక్కినన్ మధ్యలో నదివిడువ
శక్యమగునె మానవునకు? చచ్చువఱకు
విడువజాలడు వ్యసనంబు వెట్టియబల.

ముందుముందు నాజీవితమెట్లుగా మారునో నాకే బోధపడుట లేదు. సముద్రములో మునిగిపోవుచున్నాననిమాత్ర మప్పుడప్పు డనుకొనుచున్నాను. ఇంతకంటె నే నేమి చెప్పవలయునో నాకు బోధ పడుటలేదు. జీవరక్షణ శిక్షాదక్షుడగు నాపరాత్పరు డొక్కడే దిక్క గునని మధ్యమధ్యను తలంచుచు నాతనిమీదనే భారమిడితిని. నీవును నట్లే బావించుటకన్న నిక వేరుమార్గము లేదు.

శారద—కాకున్న దికాక మానదందురు గదా? వేళ యతిక్రమించు చున్నది. భోజనమునకు దయచేయుదురా?

రామారావు—అట్లే కానిమ్మ. (ఇరువురు వంట యింటిలోని కేగు దురు.)

చిట్టితల్లి—అన్నయ్యా! నీవు పెద్దవాడవై డబ్బు గడించి యమ్మ కియ్యాలి. అప్పుడమ్మ సంతోషిస్తుంది. నీవు చదువు కోవడాని కవసరమైతే. నాగొలుసు పుచ్చుకో. యియ్యనా? (అని

రామం—చెల్లాయి! నీ గొలుసు నాకెందుకు. నేను మగవాడను. డబ్బులు గడియించి చదువుకొంటాను. నీ గొలుసు నీమెడలోనే యుంటే యందము.

(రామారావు భోజనము ముగించి, చేతులు తుడుచు కొనుచు ప్రవేశించి)

రామారావు—(తనలో) యీవాళతో బ్రాందిసీసాలు కాళీ అయి పోయినట్టె. కొండామంటే చేతిలో పైసాలేదు. సరసీ రుహామునకు డబ్బు యిచ్చుటలేదని విసుగుకొనుచున్నది. వేణు, హరి పేకాటకురమ్మని పిలిచినారు. యీపూటకూడా గడిచేదిమిత్తు కనిపిం చుటలేదు. ఇందుకేమి చెయ్యాలి. (అని యాలోచించుచు చిట్టితల్లి మెడలో యున్న గొలుసుచూచి) అదిగో! చిట్టితల్లి మెడలో గొలుసు మెరుస్తూ నన్నాకర్షిస్తూంది. ఆ గొలుసుగాని సంగ్రహించినట్టయితే కొంత కాలక్షేపమగును. (అని గొలుసును తీయును)

చిట్టితల్లి—నాన్నా! నాన్నా! నా మెడలోని గొలుసు తీశావెందుకు. ఆ గొలుసన్నయ్య చదువుకిస్తాను. నీ కియ్యను.

రామారావు—(కోపముతో కళ్ళెఱ్ఱజేసి) ఛీ! నోరు మూయుము. నీ విచ్చుదానవు. నేను పుచ్చుకొనువాడనా? (అని చెంపకాయ కొట్టును)

చిట్టితల్లి—(వెక్కి వెక్కి యేడ్చుచు) అమ్మా! అమ్మా! నాన్న నన్ను కొట్టి అన్నయ్య చదువు కియ్యాలనుకొన్న గొలుసు తీసికొన్నాడు.

(వంటయింటినుండి శారద వేగముగా ప్రవేశించును)

శారద—(విచారముతో) ప్రాణేశ్వరా! చిట్టితల్లికి పుట్టినరోజున బహుమతిగా మీచేతితో నిచ్చిన బంగారుగొలుసు తీసికొని పాడుచేయుట న్యాయముకాదు. నాప్రార్థన మన్నించుడు. చిట్టితల్లి గొలుసు నిచ్చివేయుడు.

రామారావు— (జేబునుండి బ్రాందిసీసాతీసి త్రాగి) ఏమిటి ప్రేలుచుంటివి. జాగ్రత్త. గొలుసు చిట్టితల్లి పుట్టినపుడే గడియించి తెచ్చినదా? నేనుచేయించిన గొలుసు నేనే తీసికొనకూడదా? ఇక నోరుమూసికొనుము. (అని శారదను చెంపకాయకొట్టును)

రామం— నాన్నా! అమ్మ యేమితప్పుచేసిందని కొట్టావు? గొలుసు తీసికొనవద్దందనేనా? (అని యడ్డుకొనును.)

రామారావు—ఓరీ! కుట్టికుంకా! గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు నీవా నాకుబుద్ధులుచెప్పి యడ్డేవాడవు (అని రామమును కొట్టును. రామం పడిపోవును. రామారావు నిష్క్రమించును.)

తె ర వా లు ను.

---

## పదునైదవ రంగము

(అప్పారెడ్డి ప్రవేశించును)

అప్పారెడ్డి—(తనలో) అదిగో! గోవిందరాజుగారి కుమారుడగు రామా రావిటై వచ్చుచున్నాడు. ఆతనికి దుర్వ్యసనము లన్నియు నలవడియున్నవి. మున్నొకపర్యాయము జూదమాడరాదని బోధింప ప్రహారములచే నన్ను బహూకరించె. నానాటికి నీతిస్థితి క్షీణచంద్రునివలె క్షీణించుచున్నది. కావున మరల నొకమారు చెప్పి చూచెదను.

(అంతట రామారావు ప్రవేశించి నడచిపోవుచుండును.)

అప్పారెడ్డి— రామారావుగారూ! మీతో ముచ్చటింపవలసిన సంగతులు గలవు. కొంతసేపాగుడు.

రామారావు— (నిలబడి జేబులోని బ్రాందీసీసాను తీసి త్రాగుచు) నీవు చెప్పదలచిన దేమిటో చెప్పవచ్చును.

అప్పారెడ్డి— మీరిప్పుడు త్రాగుచున్న దేమి?

రామారావు—ఓ గ్రుడ్డి వాడా! సీసాపై నంటించిన కాగితమునైన చూచి బ్రాందిసీసాయని గ్రహింపలేకుంటివా?

అప్పారెడ్డి— గ్రహించితిని. కాని మీరేమి చెప్పెదురో యని యడిగితిని. క్షమింపుడు. మీరు త్రాగునది బ్రాందికదా? దానినేల త్రాగుచున్నారు. అట్టి వస్తువులను త్రాగిన నది త్రాగుడని పించుకొనును. ఈ త్రాగుడునకుతోడు జూదమాడుట మరియు వేశ్యా సంపర్కము మిమ్మావహించియున్నవి. ఇవి వ్యసనములతో జేరును. యింతకుమున్నొకనాడు త్రాగుడు, జూదము కూడనిపనియని బోధింప నన్నావలకు గెటించివైచిరి. నాటినుండి వ్యసనములకు జిక్కియుండుట

వలన మీసంసార మధోగతియగుచున్నదని యైన గ్రహించియుంటిరా? నేను వేశ్యాసంపర్కముపలన గల్గు నష్టములు చెప్పెదను. సావధానముగా వినుడు.

తే. గీ. వేశ్యప్రేమమకోరుచు విచ్చలవిడి
తమకుగల ధనంబెల్ల దానికిచ్చి
మోసపోదురు; తుదకునా మోసమెరిగి
తొత్తు రంతకుచేయగ సొమ్ముగలదు.

తే. గీ. కల్లప్రేమనుజూపెడు కాంతలందు
వెఱ్ఱిప్రేమనుజూపుచు విత్తమెల్ల
వారికర్పించి తుదకు నేవారికైన
దాసులగుచుంద్రు తమకు నేతాసులేక.

తే. గీ. ఎంతధనమిడి ప్రేమచే చెంతనున్న
యితరులను చేరదీయుచు యింపుచూపు
వేశ్య చాటుగా పలువుర వేళజూచి
యట్టివేశ్యల ప్రాపును యహహాతగునె.

తే. గీ నీవులేకున్న నిముషంబు నిల్వలేను
యొట్టు నామాట నమ్ముము యొట్టటంచు
నెన్నిమోసాలాడుచు యింపుగూర్చి
ధనములాగును నేర్పుగా దప్పకుండ.

తే. గీ. ధనములాగంగ కోర్కెలు మనమునందు
గల్గియెల్లపుడును దప్పుగా దలపక

చాలమందితో ఊోకుగా సరసమాడు
సానికొంపలురోగాల సరణినొప్పు.

తే. గీ. చేతధనమున్న వేశ్యలు చిత్తరంజ
నంబుచేతురదియుడుగ నాతనిమెడ
బట్టి యీవలద్రోయురే! యట్టివేశ్య
భార్యకన్నను నెక్కుడే బాపపురుష.

ఇప్పుడు మీరు సరసీరుహామనే వేశ్యాలంపటులై ధనమును పాడుచేసికొనుట మంచిదికాదు. నామాట లాలింపుము.

రామారావు—— (తూలుతూ) ఓరి నిర్భాగ్యదామోదరచక్రవర్తీ! ఏమి టోచెప్పుతావని నిలుబడి వింటుంటే యిదట్రా నీవు చెప్పేది. ఓరీ! మూర్ఖుడా! ఇక నీప్రేలాపన గట్టిపెట్టి నోరుమూసుకొని యూరకొనుము. (అని అప్పారెడ్డిని త్రోసికొనిపోవును)

అప్పారెడ్డి—— రోగికి పత్యాహారము రుచింపనట్లు నాపలుకులు వీని చెవికి రుచించుటలేదు. ఇది కాలమహిమ.

(అని నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

# పదునారవరంగము

(సరసీరుహము ముస్తాబగుచుండగా తెరలేచును)

సరసీరుహం— (తనలో) ఇక రామారావుకు స్వస్తివాక్యము చెప్పి చల్లగా సాగనంపవలసినదే! వీనివలన నిక నెందుచెరకు గడనుండి రసముకారని చందంబున డబ్బు రాలదు. ఇక నిట్టివానితో సరసము లేమిటి?

తే. గీ. ధనములేనట్టివానిని దవ్వులుకొన్న
వారకాంతకున్నదియును వదలిపోవు
జోగియునుజోగిరాపాడు-చో రజంబు
వ్రాలునే భువి బూడిదవ్రాలు గాక.

ఈశనిగొట్టువీనుగను వదలించుకొందమన్నను వదలిపోవుట లేదు. ఈరోజున కఠినముగా చెప్పి పొమ్మనకున్న వీలులేదు.

ఆ. వె. వయసురూపుగల్గు వారకాంతలకెందు
ధనమునిచ్చువాడె ధవుడటంద్రు
వయసుమళ్లువెనుక వచ్చునే ధనరాసి
వలపులున్న వారవనితకెపుడు.

ఇంకొక్క సంగతి.

ఆ. వె. వయసునందుగన్నవరసుతుండు; వయసు
నందు గూడబెట్టు నర్థరాశి
ముప్పుకాలమందు ముదమునిచ్చుననెడి
మాటలెల్ల పొల్లుమాటలగునె?

(ముందునకు చూచి) అదిగో! శనిగ్రహము రామారావు తూలుతూ వచ్చుచున్నాడు.

(అంతట రామారావు తూలుతూ ప్రవేశము)

రామారావు— (బ్రాందిని త్రాగుచు) అలో! సరసీరుహాం ఏం చేస్తున్నావు?

సరసీరుహాం— మీరు తెచ్చే నగలు పెట్టుకుందామని, మీరిచ్చే చీరలు కట్టుకుందామని, మీరీయబోయే డబ్బు దాచిపెట్టుకొందామని, సిద్ధముగా కనిపెట్టుకొని కూర్చున్నాను. తెలిసిందా?

రామారావు— నీకేమీ యివ్వడంలేదనా! యీకోపము. కనులు చిట్లించడమూను? నీకిద్దామని ఘోషిట్టితల్లి మెడలోని గొలుసు తెస్తూంటే మధ్యదారిలో వేణు, హరులు కనుపించి పే! టాకాయము రమ్మంటే, ఆగొలుసు నూట యాభైబది రూపాయల కమ్మి వారితో వెళ్ళి తాగుదామోయూ! కొద్దిగా రూపాయిలు మిగిలితే బ్రాందీసీసాకొని త్రాగుతూవచ్చేను. ఇంతకు నీవు అదృష్టవంతురాలవు కావు.

సరసీరుహాం—ఔను! నిజమే మీలాంటి శనిగ్రహము దాపురించాక నేనెల్లాగ అదృష్టవంతురాల నవుతాను? శనిగ్రహము వదలితేగాదూ? అదృష్టవంతురాలనౌట!

రామారావు— (తూలుతూ) నన్ను శనిగ్రహముగా పోల్చేవా? ఈమద్యమును పోలిలో కబ్బులేక యివ్వలేకపోయేనసా? ఈ దెబ్బలన్నీ.

సరసీరుహాం—మహాయిచ్చేవారని పాపము, మీరిచ్చినడబ్బే యింటి నిండా కుప్పలుపడియున్నది.

రామారావు— అట్లయిన నిదివర కియ్యలేదందువా?

సరసీరుహం— యికముందు యీయనక్కరలేదందురా? నిన్నయన్నము తింటిమిగదా? మరల నేడేల తినవలసివచ్చెను?

రామారావు— యేనాటి కానాడే యందీయవలయునా?

సరసీరుహం— సాలునట్లయట్లే. యిది పుస్తెగట్టిన భార్యయనుకొంటివా? పసుపరాయి పెట్టుటకు?

రామారావు— చేత ధనములేకున్న నేమిచేయవలెను?

సరసీరుహం— (కోపముతో) చేతధనములేకున్న నేమిచేయవలయునో చెప్పవలయునట! బాగుగానున్నది. అందరినెత్తి కొట్టి మేముధనము సంపాదించుకొనుచుండె, మాలోక్కమువంటి త్రాగవలయు ననుకొనుచున్నావు గావలయును. ఇనాటి నెప్పుడువిడుము. భోగములమ్ముము భార్యమెడలోని పుస్తె తెంపుము. పిల్లలగొంతుకకోసుకము. తెలిసిందా? అవియన్నియు నాకెందుకు? నాగుమ్మములో నడుగు పెట్టదలచుకొన్నచో రూపాయలను తీసికొని రమ్ము. లేకున్న నేనూరియందైన నురుకుము పొమ్ము. (అని వెడలిపోవును)

రామారావు— అట్లయిన నింకేమి? దొంగాడి పెళ్ళాము గారిదే. యిల్లో యున్న నగలన్నియు యీయింటియందే యుండవలెను. (అని కూడా వెంబడించును.)

తెర వ్రాలును.

---

# పదునేడవరంగము

(రామారావు బ్రాంది త్రాగుచు ప్రవేశించును)

రామారావు— (త్రాగుటముగించి) చిట్టితల్లి మెడలోని బంగారు గొలుసు నమ్మి, జూదమాడగా మిగిలిన ధనముతో, కడపటిసారి బ్రాందిసీసానుకొని, త్రాగుచుండగా బ్రాందిసీసా యడుగునకు చేరినది. నానాటకమును, యంత్యమగుచున్నది. ఈకొద్దిపాటి బ్రాందిని మిగల్చక త్రాగివేసిన, యీత్రాగుబోతు నాటకము అంత్యమగును. (అని మిగిలిన బ్రాందీని త్రాగి సీసాను పారవేసి) యిక ఈసీసా కాళీయైనది. త్రాగుదమన్న బ్రాంది దొరుకుమార్గమును లేదు. (కొంచమాగి) త్రాగుటకు బ్రాందీ లేకపోవుటవలన, మత్తత, తూలుట, ప్రేలుటకూడ తగ్గిపోయినవి. భూములనమ్మితిని. యిండ్లు తనఖాపెట్టితిని, భార్యనగలు పుస్తెతోసహిత మమ్మివేసితిని. కడపటిసారి చిట్టితల్లి మెడలో గొలుసుకూడ నమ్మివేసితిని. యిక నమ్ముటకు మిగిలిన దేదియునులేదు. కట్టుబట్టలతోడమాత్రము శరీరము మిగిలియున్నది. (కొంచెముతాళి) ఓజగన్నాటకసూత్రధారీ! నీవాడించు యీజగన్నాటకమునందు, నొక కవిశిఖామణిచే రచియింపబడిన ఓన్లీవన్‌కప్ అను నాటకమునందు నాచే త్రాగుబోతువేషమును వేయించితివా? నీలీల లనంతములు. నీవాదిమధ్యాంతరహితుడవు. నీవెరుగని దేదియునులేదు. ఇకముందు నాచే నెట్లు నటింపజేసెదవు? (కొంచమాగి) మానసమా యేమని బోధించుచుంటివి? ఆసంగతి కవిశిఖామణినే యడుగమంటివా! సరిసరి, ఓ కలిశిఖామణీ! నాచే నీ త్రాగుబోతువేషమును వేయించి, నీవేమియానంద మనుభవించితివో? ఆ యానంద మనుభవించితివా? యికముందు నాచే నేమి చేయించ

దలచితివి? ఆ? ఏమంటివి? తినబోవు కూరలు రుచియడుగనేల? అనియా! సరే కానిమ్ము.(కొంచముతాళి) అయ్యో నామనస్సు లాగు చున్నదెచ్చటకోగాని. త్రాగుటకా బ్రాందిలేదు. జూదమాడుటకా చేతడబ్బులేదు. ధనములేకున్న గుమ్మమెక్కవలదని సరసీరుహాము నిష్కర్షగా చెప్పివైచినది.

ఇకముందేమి చేయవలయును? కడపటిసారి సరసీరుహామన్న మాటయేమిటి? భూములమ్ముము. భార్యమెడలోని పుస్తె త్రెంపుము. పిల్లల గొంతుక పిసకుము. లేకున్న నూతిలో బడుమనిగదా! చెప్పినది. భూములమ్మితిని. భార్యమెడలోని పుస్తెతెంపితిని. ఇక మిగిలిన దేమి? పిల్లగొంతుక పిసగుట. అవసరమగునెడ నూతిలోని కురుకుట మిగిలియున్నది? అయ్యో డబ్బులేకున్న సరసీరుహాము గుమ్మమెక్క నిచ్చునా? ఇక పిల్లల గొంతుక పిసకవలసినదేనా? అయ్యో! త్రాగుటకు ఓస్లీవన్కప్ బ్రాందియైనలేదుగదా? సరసీరుహామునకు నేనేమని జవాబిచ్చితిని? దొంగాడి పెళ్ళాము గౌరిదేవనిగదా? ఇక సంసయింపవలసిన పనియేమున్నది. (అని ముందునకు చూచి) అదిగో! అచ్చట నొకబాలిక శరీరమునిండా నగలుపెట్టుకొని యున్నది. ఆనగల నపహరింతునుగాక! (అని నిష్క్రమించి కొంతసేపటికి రక్తపు మరకలతో కూడిన శరీరముతో (నుడగలతోను ప్రవేశించును)

ఆబాలికను ఖండ ఖండములుగా ఖండించి నగల నొలచి తీసికొని వచ్చితిని. వీటితో కొంతకాలము స్వేచ్ఛగా కాలము గడుపవచ్చును.

(తెరలో అదిగో! అక్కడబాలికను చంపి నగల నపహరించిన హంతకుడున్నాడుపట్టుకొనుడు)

రామారావు—(వినుటనటించి) కొంప మునిగినది. అదిగో! పోలీసు వారునన్ను పట్టుటకు వచ్చుచున్నారు. యిక నాగతి

షమిత్ ఇచ్చట నుండిన ప్రమాదము వచ్చును. (అని షర్గులిడి పారి పోవును)

(పోలీసుఇనస్పెక్టరు ఇరువురు పోలీసులు వెంటనే ప్రవేశింతురు.)

ఇనస్పెక్టరు—మీరు వేగముగా రానందున హంతకుడు పరారియైనాడు. చూచితిరా? ఎట్లయిన వానిని బట్టుకొనుడు. నేనును వచ్చుచున్నాను. (పోలీసు జవానులు ముందు వెనుక ఇనస్పెక్టరు వెడలుదురు.)

తెర వ్రాలును

---

## పదునేనిమిదవరంగము

---

(శారద చిట్టితల్లి యుండగా తెరలేచును)

చిట్టితల్లి— అమ్మా! అమ్మా! అన్నయ్య యింతవరకు రాలేదు. బడి వదలుపెట్టు వేళవలేదా?

శారద— ఇంకను వేళకాలేదనుకొందునమ్మా?

చిట్టితల్లి— అన్నయ్య చదువుకొని యుద్యోగముచేసి, తెస్తేనేగాని మనకష్టాలు గట్టెక్కవమ్మా!

శారద—ఔను చిట్టితల్లీ!

చిట్టితల్లి— నాన్నకు మనమీద దయలేకుండాపోయిందే మమ్మా!

శారద— అది భగవద్విలాసమును, మనయదృష్టమును.

చిట్టితల్లి— అమ్మా! నాన్నకు మనమీద ప్రేమకలుగుతుందంటావా?

శారద— మనస్సుమారిన కలుగవచ్చును.

చిట్టితల్లి— (ముందునకుచూచి) అమ్మా! అమ్మా! నాన్న యేమో గాని వగర్చుచు, పరుగిడలేక పరుగిడలేక వచ్చుచున్నాడమ్మా!

శారద—(లేచినిలువబడి ముందునకుచూచి) ఔను! నిజమే.

(అంతరామారావు ప్రమాదించినది ప్రమాదించినది, అని కేకలువేయుచు ప్రవేశము)

శారద— నాథా! నాథా! ఏమిప్రమాదించినది? మీశరీరమునిండా నీరక్తపు మరకలేమి?

రామారావు— (కంగారుగా) చేత ధనములేనికతన, సరసీరుహాం తనయింటికి రావలదనుటచే, ధనసంపాదనోపాయము గానక, చింతించినొకచో నొకబాలిక నగలతో కనుపించినంత, ఆబాలికను చంపి నగల నపహరించితిని. ఆసంగతి పోలీసువారు తెలుసుకొని, నన్ను పట్టుకొనవలయునని వచ్చుచున్నారు. వారికి పట్టుపడకుండా తప్పించుకొని వచ్చితిని.

శారద—అయ్యో! ఎంతపని జరిగినది.

రామారావు— జరిగిపోయినదానికి విచారించిన లాభములేదు. ఇంత కాలము పౌరుషముతో బ్రతికిన నేను, పోలీసువారి చేతికిదొరకి, చివర కురిశిక్ష ననుభవించుటకంటె, నూతిలో నురికి ప్రాణములు పోగొట్టుకొనుట మంచిదని తోచుచున్నది.

శారద— నాథా! ఆత్మహత్య మహాపాతకము. అదియుకాక, మీ రీవిధమున ప్రాణములు గోల్పోయిన, వైధవ్యమనుభవించుచు, భూమిమీద ప్రాణములుగలిగి, బ్రతుకలేను. కావున పోలీసువారు పట్టుకొనిన పట్టుకొననిండు. అంతమాత్రమున ప్రమాదము లేదు. కోర్టులెక్కనపిమ్మట నేమిజరుగునో చూతము.

మనమును తెలివిగల నొకవకీలుచే వాదింపవచ్చును. రుజావు లేకున్న దోషులు నిర్దోషులుగా పరిగణింపబడవచ్చును. ఒక్కొక్కప్పుడు న్యాయ మన్యాయముగను, అన్యాయమున్యాయముగాను, న్యాయాధికారులకు తోచవచ్చును. లేక భగవంతునకు దయగలిగి మనవిపత్తును వారింపవచ్చును, నాపతివ్రితా ప్రిభావమైన మిమ్ముకాపాడవచ్చును. కావున శాంతివహించి తాళుడు.

(తెరలో అడుగో! హంతకుడాయింటియందున్నాడు పట్టుకొనుడు)

రామారావు— శారదా! అదిగో! పోలీసువారు వచ్చుచున్నారు.

శారద— నాథా! పోలీసువారిని నేను కొంత శాంతచిత్తులను చేయుదును. అంతవరకు మీారాగదియందు వేచియుండుడు.

రామారావు నిష్క్రిమించును, మరియొకప్రిక్కనుండి పోలీసు జవానులు యినస్పెక్టరు ప్రివేశింతురు.)

ఇనస్పెక్టరు—(శారదతో) ఈయింటియందు హంతకుడుండవలయును ఏడి?

శారద— హంతకుడెవరు? ఈయింటియందుండుటేమి? మీారెవ్వరు?

ఇనస్పెక్టరు— నేను పోలీసు యినస్పెక్టరునని నావేషము తెలుపుట లేదా? హంతకుడు రామారావు.

శారద— ఆతడేనేరము చేసెను?

ఇనస్పెక్టరు— ఈసంగతి నీతో చెప్పవలయునా?

శారద— క్షమింపుడు తెలియ కట్లంటిని.

ఇనస్పెక్టరు—ఆతడొక బాలికనుచంపినాడు. నీవాతని భార్యవుకావా?

శారద—శిశుహత్య చేసినవారెవ్వరోకాని, యీా యిల్లు గోవిందరాజుగారిది. నేను వారికోడలను

ఇనస్పెక్టరు—రామారావు గోవిందరాజుగారి కుమారుడేకాదా!

శారద—ఔను.
ఇనస్పెక్టరు—నీవు రామారావు భార్యవేనా?
శారద—ఔను.
ఇనస్పెక్టరు—రామారావే శిశుహత్య చేసినాడు. అతడిప్పుడీ యింటి యందు లేడా?

(ఇంతలో పెరటిలోగల నూతియందు రామారావు పడుట వలన గుభిల్లుమని చప్పుడు వినిపించును.)

శారద—(చప్పుడువిని) (తనలో) వలదు, వలదనుచున్నను మన్నాధుడు నూతిలోనికి ఉరికియుండె. నేనును నాభర్తతో నానూతి జలమునందే బడి మరణించుటమేలు. ఓభగవంతుడా త్రాగుడుపిశాచమును మాయింట ప్రవేశపెట్టి, మిమ్మిట్టి యిక్కట్లకు పాల్పడ చేసితివి. ఇక నాపిల్లలను కాపాడుభారము నీది.
ఇనస్పెక్టరు—నేనడిగిన ప్రశ్నకు జవాబు చెప్పక యేమిటి యాలోచించుచున్నావు?
శారగ—ఇప్పుడు వారు యింటికి వచ్చినమాట వాస్తవము. ఇంటి యందున్నారో లేదో తెలియదు. పోయిచూచివచ్చెదను. (శారద వెడలును. చిట్టి తల్లి వెంబడించును శారద పెరటిలోనికేగి నూతియందురుకును. గుభిల్లున చప్పుడగును.)
చిట్టితల్లి—(ప్రవేశించి వెక్కి వెక్కి ఏడుస్తూ) మా అమ్మా నాన్న నూతిలోబడి చచ్చిపోయేరు.

గోవిందరాజు ప్రవేశము)

గోవిందరాజు—(గుండెలు తలబాదుకొంటూ) కొడుకు కోడలు నూతిలో పడిపోయేరు. కొంపమునిగింది.
ఇనస్పెక్టరు—మీాయిరువురు నూతిలోపడిన శారదా రామారావుల శవములను పైకితీయుడు.

(జవానులువిక్రమింతురు)

(రామం బడినుండి ప్రవేశము)

రామం—తాతయ్యా! అమ్మా నాన్న, నూతిలోబడి చచ్చిపోయేరని చెప్పుకుంటున్నారేమిటి (అని యేడ్చును.)

గోవిందరాజు— (కళ్ళనీళ్లు తుడుచుకుంటూ) ఔనునాయనా! మన యదృష్టమిల్లాగయుంది.

(తెరలో నూతిలోనుండి రెండుశవములను పైకితీసితిమి)

ఇనస్పెక్టరు— అట్లయిన నా రెండుశవములను, శవపరీక్షాలయమునకు గొనిపోయి డాక్టరుగారిచే పరీక్ష చేయింపుడు. ఆదారినేపోండు, నేనును వచ్చెదను.

(తెరలో చిత్తము అని వినిపించును. యినస్పెక్టరు వెడలిపోవును)

రామం— తాతయ్యా! అమ్మానాన్నా చచ్చిపోతే మరిమనకు అన్న మేలావస్తుంది? నాకు చదు వెవరు చెప్పిస్తారు?

గోవిందరాజు— (విచారముతో) అయ్యో! తుదకు మా కెట్టిగతి పట్టినది!

తే. గీ. ఏమిచేయుదు దైవమా యిపుడునేను
స్వేచ్ఛగా త్రాగితూలుచు సిగ్గువీడి
కాలమెల్లను బుచ్చితి కడకునిప్పుడు
తినుట కాహారమునులేదు దిక్కులేదు.

(అని విచారించుచుండ అప్పారెడ్డి ప్రవేశము)

అప్పారెడ్డి— గోవిందరాజుగారూ! మున్నొకపరి మీరు చాలామందితో బ్రాంది డ్రింకింగ్ పార్టీ చేయునపుడు, మీకడకే తెంచి త్రాగుడు దుర్వ్యసనమునువిడిచి పెట్టుడని బోధింప, చెంపకాయలు కొట్టి మీచే సాగనంపబడిన జీవదయామండలి గౌరవకార్యదర్శిని, అప్పారెడ్డిని జ్ఞాపకమున్నదా?

గోవిందరాజు—నాయనా! ఆరోజులలో కల్లు నెత్తికివచ్చి త్రాగిన మత్తులో నేమిచేసితినో జ్ఞాపకము లేదు.

అప్పారెడ్డి— పోనిండు దానికేమి. మీరిప్పుడాపదలో నున్నారనివిని, యుపకారము చేయవచ్చితిని.

గోవిందరాజు— అట్లయిన మన భారతదేశమందు మీవంటి సద్ధర్మ బోధకులును జీవదయాహృదయులును నగు మీరు మాపాలిటి దేవుడవనవచ్చును.

అప్పారెడ్డి— చనిపోయిన మీకుమారునకును, కోడలునకును, శవ పరీక్షానంతరము, దహనాది యుత్తరక్రియలు చేయింటకుగాను, మీకు ధనసహాయము చేయించుటకును, మీమనుమనికి మనుమరాలునకును, భోజనాదిసదుపాయము లొనర్చుటకును, వారిద్దురకును విద్యాబుద్ధులు చెప్పించుటకు జీవదయామండలి ధనాగారము నుండి ధనమిచ్చుటకును, మిమ్మోజీవదయామండలి లేఖకునిగా నియమించి, పోషించుటకును యేర్పాట్లుచేసివచ్చితిని, మీకిదిసమ్మతమేనా?

గోవిందరాజు—సంతోషము నాయనా! సంతోషము.

అప్పారెడ్డి—ఈపనులొనర్చుటకుగాను ముందు త్రాగుడు వలన నష్టమేమిటో అందరకును వినిపింతురా?

గోవిందరాజు—ఒక్కసారననేల? అవసరమగునెడల ప్రతిమీటింగునకును వచ్చి వినిపింతును.

(సభవైపు తిరిగి) నాయనలారా! నావిన్నప మాలింపుడు, అజీర్ణరోగనివారణార్ధము, ఓస్లీవన్‌కప్ బ్రాందిని ప్రతిదినము త్రాగడము ప్రారంభించేను. అది రాను, రాను, అభ్యాసము క్రిందమారుటచే, డ్రింకింగ్‌పార్టీ చేయించి, బ్రాంది చలివేందరలు పెట్టించాను. అంతటితో అధికారులునన్ను ఉద్యోగమునుండి తొలగించేరు. నా యలవాటు మా అబ్బాయికి యలవడింది. నా భార్య బెంగచేత

మంచముపట్టి చచ్చిపోయ్యింది. మా అబ్బాయి నాకంటె యెక్కువ త్రాగి జూదము, సానులిండ్ల ప్రవేశించడము, నేర్చుకొని ఆస్థిఅంతా పాడుచేసుకొని, ఆఖరుకు హత్యకూడాచేసి, నూతిలోబడి ప్రాణము లువిడిచేడు. వానితో వానిభార్యకూడా నూతిలోపడింది. ఇప్పుడు నాకు ముసలితనము వచ్చింది. మనుమని మనుమరాలిని పోషించవలసి వచ్చింది. చేతులలో డబ్బులేనిస్థితి. ఏమిచేయనురా భగవంతుడాయని చింతిస్తూయుంటే. జీవదయాహృదయులగు యీఅప్పారెడ్డి మ్మాపాలిటిభగవంతుడైనాడు గనుక మీరందరు మమ్ముచూచి, మానాటకమునుచూచి, బుద్ధితెచ్చుకొని త్రాగుడుమానండి, త్రాగుడుమానండి, త్రాగుడు మానండి, లేకపోతే చెడిపోతారు. సర్వనాశనమౌతారు.

అప్పారెడ్డి—గోవిందరాజుగారూ! మీకన్ని సదుపాయములు గలుగ జేసితినిగదా? ఇక మీకేమి కావలయును.

గోవిందరాజు—అప్పారెడ్డి! ఐన నిట్లగుగాక.

తే. గీ. వ్యసనసప్తకంబుల జిక్కి వ్యర్థముగను
యూస్థినంతయు మనుజుండు యంతరింప
జేసికొనకుండ కాపాడిచెనటిగాక
భూమియందున సౌఖ్యంబు బొందుగాక.

అప్పారెడ్డి—తథాస్తు. తథాస్తు.

స మా ప ము.

# డాక్టర్ రత్నం అండా సన్సు

మెడికల్ హాల్ 252 బి. మలకపేట, హైద్రాబాదు.

## 40 సం॥రముల ప్రపంచ ప్రఖ్యాతిగల గ్యారంటీమందులు.

1. వీర్య స్తంభనరసాయనం—వీర్యవృద్ధి బలము సంభోగశక్తి గలిగించును. 40 దినములకు రు 5—0—0 లు.

2. నపుంసకతైలం—అంగములావు, పొడవు బలము గలిగించును. 1 సీసా రు 10—0—0 లు.

3. బంగారునపుంసకతైలం—పై దానికంటె 10 రెట్లధికగుణము ఆపూటనేచూపును. బాల్యములో ముష్టిమైధునం చేసినవారికి అమృతంవలె పనిచేయును. రు 25—0—0 లు.

4. గర్భనిరోధిని—స్త్రీలకు గర్భంరాకుండుటకు కొంతకాలంవరకు రు10—0—0 శాశ్వతంగా ఎప్పటికీరాకుండుటకు రు25—0—0 లు.

5. వరిబీజం—బుడ్డ, గిలక ఆపరేషన్ లేనిమందు లోపలికి, పైకి 2 మందులు 1 నెలకు రు 30—0—0 లు.

6. క్షయ—ఉబ్బసం, దగ్గు, పగర్చు, ఆయాసం, పిల్లికూతలు 3 పూటలలో తగ్గును. 1 నెలకు రు 30—0—0 లు.

7. స్త్రీలకుహిస్టీరియా—మూర్ఛ, ఏడుపు, నవ్వు, పిశాచ చేష్టలు 3 రోజులలో గుణము 1 నెలకు రు 3—0—0 లు.

8. సంతానసంజీవి—అసలు గర్భంరానివారికి కల్గి గర్భంపోవుచున్నవారికి సంతానం నిలుచును. 1 నెలకు 30—0—0 లు.

9. చెవ్పుడుకుమందు—చెవుడు, పోటు, చీముకారుట, హోరు, తగును. 40 వేలమందికి కుదిరినది. 1 సీసా రు 5—0—0 లు.

